# కాల్గేట్‌తో చెడ్డ శ్వాసను నిరోధించండి
# రోజంతా దంతక్షయం జరుగకుండా కాపాడుకొనండి!

ఎందుచేతనంటే: ఒక్కసారి తోముకుంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసనను మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి చెడ్డ శ్వాసను వెంటనే నిరోధించిందని మరియు భోజనం అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకొనుట వల్ల ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని, పూర్వము దంతశాస్త్ర చరిత్రలో ఎన్నడూ తెలియ జేయనంతగా శాస్త్ర పరిశోధనల వల్ల నిరూపించబడినది! ఒక్క కాల్గేట్ మాత్రమే దీనికి రుజువును కలిగివున్నది.

పిల్లలు కాల్గేట్‌తో క్రమంగా పళ్ళు తోముకునే అలవాటును తేలికగా అవలంబిస్తారు. ఎందుచేతనంటే ఎక్కువ సేపు నిలచే దాని పిప్పర మెంట్ లాటి సువాసనంటే వారికి చాలా ఇష్టం.

శుభ్రత కొరకు, తాజా శ్వాసకొరకు మరియు పండ్లు తెల్లగా వుండుట కొరకు కాల్గేట్‌తో పండ్లను క్రమంగా తోముకొనండి.

మీకు పౌడర్ కావాలంటే, ఈ లాభములన్నింటినీ కాల్గేట్ టూత్ పౌడర్ ద్వారా పొందగలరు... ఒక డబ్బా నెలల తరబడి వస్తుంది...




...ప్రపంచములోని ఏ ఒక్క ఇతర డెంటల్ క్రీమ్‌కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు

DCG.35 TL

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



విడి ప్రతి
0-75 పైసలు

సంవత్సర చందా
రూ. 8-40

"సంక్రాంతి శుభాకాంక్షలు!"

మీరు మీ ఊరిలో మా "చందమామ" అమ్మే చిన్న ఏజంటుగా ఉండవచ్చును. దీనికి మీరు మనిఆర్డరు ద్వారా రు. 4-50 పంపిన 8 "చందమామ" కాపీలు మీకు సప్లయి చేస్తాము. లేదా ప్రారంభంలో 4 కాపీలు మాత్రం చాలంటే రు. 2-25 పంపండి. ప్రతి కాపీకి 19 పై. చొప్పున మీకు లాభిస్తుంది. అయితే డబ్బు పంపేముందు మీ ఊరిలో ఇప్పటికే మా ఏజంటు ఎవరూ లేరు అనే విషయం రూఢిచేసుకోండి.

## చందమామ పబ్లికేషన్సు

వడపళని :: మదరాసు - 26



వారికి అభిప్రాయ భేధాలు
లేకపోలేదు.... కాని






న్యూట్రిన్
స్వీట్స్ & టాఫీలు
అంటే వారు ఏకాభిప్రాయులే!



న్యూట్రిన్ కన్‌ఫెక్షనరీ కం. (ప్రైవేట్) లిమిటెడ్
చిత్తూరు, ఆంధ్రప్రదేశ్





EP-NC-13

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మరొక సంవత్సరం గడిచింది. ఈ గడిచిన సంవత్సరంలో దేశంలో చాలా చోట్ల అశాంతి చెలరేగింది. ఒక్క మన దేశంలోనే గాక, ప్రపంచమంతటా మానవ జీవితం విచిత్రమైన పరిణామాలకు లోనై, అశాంతితో కూడుకుని వున్నది. మానవులు ఇందులో నుంచి బయటపడాలంటే నైతికశక్తులు బలపడాలి. 1967 లో నైనా ప్రపంచంలో శాంతి నెలకొని, మానవ జీవితం పురోగమిస్తుందని ఆశింతాం.

మా పాఠకుల కందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలు అందజేస్తున్నాం.

సంపుటి 40 జనవరి '67 సంచిక 1

CHITRA



# భారత చరిత్ర



మొదట సదాశివరావు భావు చాలా వివేకం ప్రదర్శించాడు. అతను తన బలాలనూ, సాధన సంపత్తినీ పెంపొందించుకుని, రాజపుత్రుల సఖ్యం సంపాదించటానికి కృషి చేశాడు. 1760 ఆగస్టు 3 న ఢిల్లీ అతని వశమయింది. అటుపైన భావుకు కష్టాలు ఆరంభమయాయి. సూరజ్‌మల్ అనే వాడు, అతనితో అభిప్రాయ భేదాలు రావటంచేత, అతని పక్షం వదిలేశాడు. మల్హార్‌రావు హొల్కరుకు కూడా అతనితో విభేదం ఏర్పడింది. దీనికితోడు ఢిల్లీ ఆక్రమణ అతని కష్టాలను పెంచింది. ఆగస్టు మధ్యలో అతను ఢిల్లీని వదిలిపెట్టి, 1760 అక్టోబరు 29 నాటికి పానిపట్టు చేరాడు.

ఈలోపుగా అబ్దాలీ ఆలీగఢ్‌ను పట్టుకుని, ఔధ్ నవాబైన షుజా ఉద్దౌలా స్నేహం సంపాదించాడు. 1760 నవంబరు 1 నాటికి అబ్దాలీ పానిపట్టు చేరాడు. చరిత్రప్రసిద్ధమైన పానిపట్టు రణక్షేత్రంలో అఫ్ఘాను బలాలూ, మహారాష్ట్ర బలాలూ తలపడ్డాయి. అబ్దాలీ సైన్యంలో 30 వేల అశ్వికులూ, 30 వేల కాల్బలమూ ఉన్నారు. మహారాష్ట్ర సేన 45,000 సంఖ్య గలది. సంఖ్యలోనే గాక గుర్రాలలోనూ, ఫిరంగులలోనూ, వ్యూహంలోనూ, కవచాలలోనూ అబ్దాలీ సేన మెరుగైనది.

రెండున్నర మాసాలపాటు ఉభయ సేనల మధ్యా చిల్లర సంఘర్షణలు సాగాయి. వీటిలోనే మహారాష్ట్రులు చాలా దెబ్బతిన్నారు. ముఖ్యంగా వారికి ఆహారపు కొరత తీవ్రంగా ఏర్పడింది. చివరకు 1761 జనవరి 14 న మహారాష్ట్ర సైన్యం శత్రువుపై యుద్ధానికి బయలుదేరింది.

అబ్దాలీ తన సేనావ్యూహాన్ని ఈ విధంగా ఏర్పాటు చేశాడు: మధ్య భాగంలో 18,000 మంది సైనికులు అబాలి వజీరైన

## 64. మూడవ పానిపట్టుయుద్ధం



షావలీఖాన్ నాయకత్వాన నిలబడ్డారు; దానికి కుడి, ఎడమ పార్శ్వాల అయిదేసి వేల సంఖ్యగల సేనలు, హెచ్చుగా అశ్వక దళాలతో కూడుకున్నవి, అమర్చబడ్డాయి; వీటికి నాజీబుద్దౌలా, షుజా ఉద్దౌలాలు అధిపతులు.

భావు మహారాష్ట్ర సేనలను కూడా మూడు విభాగాలు చేశాడు. మధ్య సేన అతని నాయకత్వం కిందనే ఉన్నది. వామ పార్శ్వపు సేనలో ఇబ్రాహింఖాన్‌గార్దీ సైనికులూ, కుడిపక్క సేనలో మల్హార్‌రావు హెూల్కర్ దళాలూ ఉన్నాయి.



మహారాష్ట్రులు ఫిరంగులతో యుద్ధం ప్రారంభించారు. వారు అత్యంత ధైర్య సాహసాలతో పోరాడి, ఆరంభంలో కొద్దిపాటి విజయం సాధించారు. ఇబ్రాహింఖాన్‌గార్దీ దుర్రానీ సేనల కుడి పార్శ్వం పైన చూపిన ధాటికి, ఎనిమిది, తొమ్మిది వేల మంది రుహేలాలు చావటమో, గాయపడటమో జరిగింది. అదే విధంగా, షావలీఖాన్ కింద వున్న దుర్రానీ మధ్య సేనను సదాశివరావు భావు తీవ్రంగా దెబ్బ తీయించి, దాదాపు గెలిచినంత పని చేశాడు.

కాని అబ్దాలీ తన మధ్య సేనలోకి 13,000 మంది కొత్త సైనికులను పంపి ఎదురు దెబ్బతీశాడు. అప్పటికే మహారాష్ట్రుల త్రాణ తరిగి పోయింది. అయినా భావు ప్రాణాలకు తెగించి పోరాటం సాగించాడు. అపరాహ్ణం రెండుంబావు వేళకు విశ్వాసరావు తుపాకీగుండు తగిలి చనిపోయాడు. ఆ మీదట భావు మరింత సాహసంతో పోరాటం సాగించాడు, కాని ఫలితం లేకపోయింది. రెండుమ్ముప్పావు గంటకల్లా, "కన్నుమూసి తెరిచేలోగా మహారాష్ట్ర సేన హారతి కర్పూరంలాగా హరించి పోయింది."

అయిదుగురు దుర్రానీ అశ్వికులు సదాశివరావు ఆభరణాలకు ఆశపడి అతని తల నరికేశారు. ఈ విధంగా సదాశివరావు భావు



తన జాతి గౌరవం కోసం ప్రాణాలు బలి పెట్టాడు. అయితే పానిపట్టు వద్ద మహారాష్ట్రులకు అపజయం సిద్ధించటానికి కారణం సదాశివరావే; అతను ఇతరుల అభిప్రాయాలను లక్ష్యపెట్టాడు కాడు, అనేక తప్పుడు అంచనాలు వేశాడు కూడా. ఓటమితోబాటు, ప్రముఖ మహారాష్ట్ర సేనానాయకులందరూ రణరంగాన ప్రాణాలు వదిలారు. అనేకమంది సైనికులూ, అమాంబాపతు మనుషులూ, స్త్రీలూ, పిల్లలూ సహా, వధించబడ్డారు.

ఈ అపజయం మహారాష్ట్ర జాతి కంతకూ తీరని దెబ్బ అయింది. ఒక తరానికి చెందిన మహారాష్ట్రనాయకు లందరూ ఒక్కసారిగా నశించారు. ప్రతి మహారాష్ట్ర గృహమూ ఈ యుద్ధంలో ఎవరినో ఒకరిని బలి పెట్టింది. మహారాష్ట్రులు 50,000 గుర్రాలనూ, రెండులక్షల పశువులనూ, అనేకవేల ఒంటెలనూ, 500 ఏనుగులనూ, అంతులేని ధనాన్నీ, నగలనూ దోపిడీ ద్వారా కోల్పోయారు. ఈ దుర్వార్త చెవిని పడ్డాక అసలే వ్యాధిగ్రస్తుడై ఉన్న పేష్వా ఆటేకాలం జీవించలేదు; 1761 జూను 23 న ఆయన పూనాలో చనిపోయాడు.

ఈ పానిపట్టుయుద్ధం మహారాష్ట్రుల కీర్తి ప్రతిష్ఠలకు గొడ్డలిపెట్టయింది. పేష్వాల అధికారం దారుణంగా దెబ్బతిన్నది. అయితే మహారాష్ట్రులు తిరిగి కోలుకోగలిగారు. పేష్వా మాధవరావు కీర్తిమంతుడు కావటమే గాక, మొదటి పేష్వా ఆశయాలను అమలు జరప యత్నించాడు. 1772 లో అతను మరణించడం మహారాష్ట్రజాతికి మరొక పానిపట్టు అపజయం అయిందని చెబుతారు.

అయినా పానిపట్టుయుద్ధం భారత చరిత్రలో ఒక విషమ ఘట్టం. ఆ యుద్ధంలో మహమ్మదీయులూ, మహారాష్ట్రులూ పరస్పరం నిర్వీర్యపరచుకోవటం వల్ల బ్రిటిషువారు లాభం పొందారు.



# నేహ్రూ కథ

## 31



జైలుఅధికారులు జవాహరును కొంత కాలంపాటు ఆవరణ దాటి వెళ్ళనివ్వ లేదు. తరవాత, తూర్పుతెల్లవారక ముందు ఒక అరగంటసేపు బయటికి వెళ్ళి, ప్రహరీ వెంబడి నడవటానికీ, పరిగెత్తటానికీ అను మతి ఇచ్చారు. అంత చీకటితో ఎందుకంటే, జవాహరు ఇతర ఖైదీలను కలుసుకోకుం డానూ, వారికి కనపడకుండానూ ఉండ గలందులకు. అతనా కాలాన్ని చక్కగా వినియోగించుకుని, రోజూ రెండు మైళ్ళు పరిగెత్తి చాలా ఆనందం పొందేవాడు.

రాత్రిపూట జవాహరు ఉపయోగించే దీపం చదువుకోవటానికి చాలేదికాదు. అందు చేత అతను చాలా త్వరగా పడుకుని తిరిగి తెల్లవారు జామున ఏ మూడింటికో, నాలు గింటికో మేలుకునేవాడు.

ఆకాశాన నక్షత్రరాసులను గమనించటం జవాహరుకు సరదాగా ఉండేది. గోడమీదిగా తొంగి చూసే ధ్రువనక్షత్రం అతని కెంతో ఆనందం కలిగించేది.

ఒక నెలపాటు జవాహరుకు వార్డరూ, ఖైదీ ఓవర్‌సీర్లూ తప్ప మరొక తోడు ఎవరూ లేరు. జవాహరు ఆనాటి జైళ్ళను ఇండియా లోని భారతప్రభుత్వంతో పోల్చాడు. జైలు నిర్వహణ అంతా ఖైదీలతోనే సాగుతుంది. తమ శిక్ష తగ్గుతుందనే ఆశతోనూ, సత్ప్ర వర్తనగలవాళ్ళ మనిపించుకోవాలనీ ఖైదీలే జైలు వార్డర్లుగానూ, ఓవర్‌సీర్లుగానూ, వంట వాళ్ళుగానూ, పాచిపని చేసేవాళ్ళుగానూ పనిచేస్తారు.

జవాహరు మరొక విషయం గమనిం చాడు. జైలులో ఉన్నవాళ్ళలో అత్యధిక భాగం నేరస్వభావులు కానేకారు. ఎక్కడ నైనా గ్రామాలలో దొమ్మీలు జరిగితే అందిన వాళ్ళనల్లా ఒక మందగా పట్టుకుని జైలులో




పెట్టటం అనాటి బ్రిటిషు అధికారులకు అలవాటు. విప్లవకారులను ఒంటరి ఖైదులో ఉంచటం మరొక దురలవాటు. ఎవరి సంపర్కమూ లేకుండా మనిషిని ఒంటరిగా ఖైదులో ఉంచటం అతి దారుణమైన శిక్ష. కొద్ది వారాలలో మనిషికి మతి పూర్తిగా చెడిపోతుంది. జైలులో కొన్ని నేరాలు చేసిన వారికే ఆ శిక్ష ఇవ్వాలి. తెల్లతోలు గల ఖైదీలకు అన్ని సౌకర్యాలూ ఉండేవి. జవాహరు ఖైదీలలో హెచ్చు మానవత్వం చూసి, "జైలు బయటకన్న జైలులోనే హెచ్చు దాక్షిణ్యం, నిజాయితీ ఉన్నది," అని నిర్ణయించుకున్నాడు.



గాంధీజీ "మట్టి బొమ్మలను వీరులుగా చేయగలడు" అని గోఖలే అన్న మాట 1930 లో బాగా రుజువయింది. శాంతియుత శాసనోల్లంఘనోద్యమం దేశాన్ని చైతన్యవంతం చేస్తూనే వచ్చింది. ఉద్యమానికి అనుకూలులూ, ప్రతికూలులూ కూడా దాని ప్రభావాన్ని ఆమోదించక తప్పలేదు. స్వరాజ్యం దగ్గిర పడిందన్న భావం జైలు గోడల లోపలికి కూడా పాకింది. బయటికి వెళ్ళి బజారు కబుర్లు విని వచ్చే వార్డర్లు స్వరాజ్యం వచ్చేస్తున్నదనే నమ్మారు. చిల్లర జైలు అధికార్లకు కాస్త కంపరం కూడా పుట్టింది.

జైలులోకి దిన పత్రికలు వచ్చేవి కావు. ఒక హిందీ వారపత్రిక వచ్చేది. అందులో వార్తలు కొద్దిగా ఉండేవి. రోజూ లాఠీచార్జీలు జరుగుతున్నాయి. అప్పుడప్పుడూ కాల్పులు కూడానూ. షోలాపూరులో మార్షల్ లా ప్రకటించి, జాతీయజెండా ఊరేగించిన వారికి పదేసేళ్ళు శిక్షలు విధించారు! దేశమంతటా స్త్రీలు ముందుకొచ్చి ఉద్యమం నడుపుతున్నారు. జవాహరు తల్లీ, చెల్లెళ్ళూ, భార్యా, దగ్గిర బంధువులైన స్త్రీలూ, స్నేహితురాళ్ళూ అందరూ తీవ్రంగా ఉద్యమంలో పనిచేస్తున్నారు. జవాహరుకిది ఎంతో సంతోషం



కలిగించింది. కాని వారందరూ కష్టాలు పడుతూ, ప్రమాదాల నెదుర్కొంటుంటే తాను సుఖంగా జైలులో కూర్చుని ఉండటం అతని కేమీ బాగాలేదు. కాని అతను బయటికి వెళ్ళి వారితో కలిసి పని చెయ్యలేడు. అందుచేత అతను తన దినచర్యను సాధ్యమైనంత క్లేశవంతం చేసుకున్నాడు.

అతను రోజూ మూడుగంటలపాటు చరఖా మీద నూలు వడికేవాడు. రెండు మూడుగంటలపాటు నవారు నేసేవాడు. ఇందుకు తగిన ఏర్పాట్లను అతను జైలు అధికారులను కోరి చేయించుకున్నాడు.

ఈ విధంగా ఒక నెల గడిచాక నర్మదా ప్రసాదసింగ్ వచ్చాడు. జవాహరుకు తోడు దొరికింది. 1930 జూను అఖరు రోజున మోతీలాలూ, డా. సయ్యద్‌మహ్మదూ జవాహరున్న జైలు ఆవరణకు వచ్చారు. వారిద్దరూ ఆనందభవనంలో నిద్రపోతూన్న సమయంలో పోలీసులు వచ్చి అరెస్టు చేశారు. వారి రాకతో జైలులోని ఆ ఆవరణలో సందడి ఏర్పడింది.

మోతీలాలు అరెస్టుకు కాస్త ముందుగానో వెనకగానో కాంగ్రెసు వర్కింగు కమిటీ నిషిద్ధసంస్థగా ప్రకటించబడింది. అంటే కమిటీ మీటింగు జరిగే సమయం చూసి,



సభ్యులందరినీ మూకఉమ్మడిగా అరెస్టు చేస్తారు. అందుచేత అదనపు సభ్యులను చేర్చారు. వారిలో జవాహరు భార్య కమల కూడా ఉన్నది.

జైలుకు వచ్చేనాటికి మోతీలాలు ఆరోగ్యం ఏమీ బాగాలేదు. ఆయనకు తగిన సదుపాయాలు చెయ్యటానికి జైలు అధికారులు సిద్ధంగా ఉన్నప్పటికీ, జైలులో సౌకర్యాలు లేవు. జవాహరు ఉంటున్న ఖైదులో నాలుగే చిన్న కొట్లున్నాయి. ఆ నాలుగింటిలోనూ నలుగుర్ని కుక్కారు. మోతీలాలును కొంచెం విశాలమైన గదిలో ఉంచుతానని జైలు సూపర్నెంటు అన్నాడు. కాని నలుగురూ

కలిసి ఉండగోరారు. అలా అయితే మిగిలిన ముగ్గురూ మోతీలాలును కనిపెట్టి ఉండటం సాధ్యమవుతుంది.

అవి వర్షారంభ దినాలు. కప్పు చాలా చోట్ల కురుస్తున్నది. గదుల నిండా తేమ. రాత్రిపూట మోతీలాలు పక్క ఎక్కడ అమర్చాలనేది ఒక సమస్య అయిపోయేది. అప్పుడప్పుడూ ఆయనకు జ్వరం తగులుతూ ఉండేది. చిట్టచివరకు జైలు అధికారులు ఒక విశాలమైన వరండా ఆ ఇంటికి చేర్చి నిర్మించటానికి నిశ్చయించారు. అది పూర్తి అయేసరికి మోతీలాలు విడుదల కానే అయాడు. అందుచేత ఆ వరండా మిగిలిన వాళ్ళకు చక్కగా వినియోగపడింది.

జులై ఆఖరులో సప్రూ జయకర్లు కాంగ్రెసుకూ, ప్రభుత్వానికీ మధ్య రాజీయత్నాలు చేస్తున్నట్టు పుకార్లు బయలుదేరాయి. వైస్రాయి అయిన లార్డ్ ఇర్విన్‌కూ, సప్రూ జయకర్లకూ మధ్య నడిచిన ఉత్తర ప్రత్యుత్తరాలు పత్రికలలో పడ్డాయి. సప్రూ జయకర్లు గాంధీజీని కూడా చూశారు. వీరి రాజీయత్నాలు ఎందుకు ప్రారంభించారో జవాహరుకు బోధపడలేదు.

జులై 27 న అకస్మికంగా సప్రూ జయకర్లు నైనీ జైలుకు వచ్చి, గాంధీజీ నుంచి జవాహరుకు ఒక ఉత్తరం తెచ్చారు. అప్పుడే జవాహరుకు ఈ రాజీప్రయత్నాలకు కారణం తెలిసింది. స్లోకోంబ్ అనే లండను పత్రికా విలేఖరి ఒక ప్రకటన తయారు చేసి మోతీలాలు అనుమతితో దాన్ని ప్రకటించాడు. ఈ ప్రకటన జూను 25 వ తేదీతో వెలువడింది. ఆ సమయానికే మోతీలాలు అరెస్టయాడు. ఆ ప్రకటన యొక్క సారాంశమేమంటే, ప్రభుత్వం కొన్ని షరతులను ఆమోదిస్తే శాసనోల్లంఘనోద్యమం ఆపివేయబడుతుందని. ఇందుకు గాంధీజీ అనుమతీ, ఆయేడు కాంగ్రెసు అధ్యక్షుడైన జవాహరు అనుమతీ కూడా కావలసి ఉన్నవి.





# పాతాళదుర్గం

## 9

[సైనికదుస్తులు ధరించి ధూమక సోమకులు, కాంతిసేనను వెతుకుతూ కొంతదూరం వెళ్ళి, ఒక సెలయేటి దగ్గిర దాహం తీర్చుకునేంతలో, ఆటవికులు వాళ్ళను చుట్టుముట్టి పట్టుకున్నారు. వాళ్ళ నాయకుడు విరూపు డనేవాడు వాళ్లను బల్లెంతో పొడవబోయినవాడల్లా, 'దొరబాబులూ!' అంటూ వాళ్ళకు సాష్టాంగపడిపోయాడు. —తరవాత]

ధూమక సోమకులు ఒక క్షణకాలం నిశ్చేష్టులయారు. విరూపుడి ప్రవర్తన వాళ్ళకు చాలా వింతగా కనబడింది.

విరూపుడు లేచి నిలబడి, "కాలశంబర మాంత్రికదొర మిత్రులైన మీరు, మాకు ప్రభు సమానులు. తెలియక చేసిన మా తప్పులు మన్నించండి," అన్నాడు.

"మేము కాలశంబరుడి మిత్రులం కాదు, శత్రువులం!" అంటూ సోమకుడు కళ్ళెర్రచేసి, పళ్ళుకొరుకుతూ కింద పడివున్న కత్తిని చేతికి తీసుకోబోయేంతలో, ధూమకుడు అతణ్ణి వారించి, "విరూపా! మేము మాంత్రికుడి మిత్రులం అని నీవెలా గ్రహించగలిగావు?" అని అడిగాడు.

విరూపుడు, ధూమకుడి నడుం నుంచి వేలాడుతున్న మంత్రదండాన్ని వేలితో చూపుతూ, "మాంత్రికదొర యీ ఉదయమే, మా గూడెంలో కొంచెంసేపు



విశ్రాంతి తీసుకుని వెళ్ళాడు. తన మంత్ర దండం వెంటతెచ్చిన వారిని ఆదరించి సహాయం చేయమనీ, అది వెంటలేని సైని కుల్ని గాని, పట్టణవాసుల్నిగాని ఒక్క అడుగైనా అరణ్యంలో ముందుకు రాకుండా హతమార్చమనీ ఆజ్ఞాపించాడు," అన్నాడు.

ఈ మాటలతో ధూమకుడికి ఆనందం, మాంత్రికుడి ఎత్తుగడ ఏమిటో అర్థంకాక భయమూ కూడా కలిగింది.

"మేం కాలశంబరుడి నివాసస్థానానికి పోతున్నాం. ఆయనకు ఒకానొక రాక్ష సుడు—కుంభీరు డనేవాడు పరమశత్రువు. వాడు నివశించే చోటు నీకు తెలుసా?



అంతేకాక కాలశంబర మాంత్రికుడు యీ రాత్రికి ఎక్కడ మజిలీ చేయబోతు న్నాడు?" అని ప్రశ్నించాడు ధూమకుడు.

"మాంత్రికదొర యీ మహారణ్యంలో, ఏ మార్గాన ప్రయాణం చేసేదీ నాకూ్కడా తెలియదు, అదంతా పరమరహస్యం. కాని, ఆ దొర నివశించే చోటు మీకూ తెలుసు కదా? దండకారణ్యంలో మహాకలి రాక్షసు డుండే పాతాళదుర్గ ప్రాంతాల. అక్కడికి మీతోపాటు కొంతదూరం వచ్చి, దారి చూపించగలను," అన్నాడు విరూపుడు.

ఎవరీ మహాకలి రాక్షసుడు? అను కున్నాడు ధూమకుడు. సోమకుడు కళ్ళింత చేసుకుని ఆత్యాశ్చర్యంతో విరూపుణ్ణి ఏదో ప్రశ్నించబోయే సరికి, ధూమకుడు అతడి మాటలకు అడ్డంవచ్చి, "విరూపా! నీవు చేస్తానన్న సహాయానికి మేం యిద్దరం చాలా కృతజ్ఞులం. ముందు భోజనం చేసి, తరవాత ప్రయాణం సాగిద్దాం," అన్నాడు.

భోజనం అన్న మాట వింటూనే, విరూ పుడు తన అనుచరుల కేసి తిరిగి, "అందరూ యిక్కడ నిలబడి వింత చూస్తున్నారా, లేక కొందరైనా పోయి, యీ దొరలకు భోజనం ఏర్పాట్లు చేస్తు న్నారా?" అని గద్దిస్తూ ప్రశ్నించాడు.





"ఆ ఏర్పాట్లన్నీ పూర్తి కావచ్చినై, దొరా! అంతా భోజనాలకు రావచ్చు," అన్నాడొక యువ ఆటవికుడు.

ధూమకసోమకులకు, విరూపుడు రాజోచితమైన విందు చేశాడు. రకరకాల మాంసాలూ, అడవిఫలాలూ, తేనే సమృద్ధిగా వున్నాయి. బాగా ఆకలిగొనివున్న ధూమకసోమకులు తృప్తిదీరా భుజించారు. తరవాత ఆతిథుల వినోదం కోసం ఆటవిక యువతీయువకులు రకరకాల నాట్యాలు చేశారు, పాటలు పాడారు; కర్రా, కత్తి సాములూ, మల్లయుద్ధాలూ జరిగినై.

ధూమకసోమకులు తమ అదృష్టానికి ఎంతో ఆనందపడ్డారు. ఎంతో కష్టసాధ్యమనుకున్న పని, వాళ్ళకా క్షణంలో చాలా తేలిక అనిపించింది. ముందు కాలశంబర మాంత్రికుణ్ణి కలుసుకోవటం, అతడి ద్వారా కుంభీరుణ్ణి వెతికిపట్టుకుని వాడి చెర నుంచి కాంతిసేనను విముక్తిచేయటం— ఇదంతా సునాయాసంగా జరిగిపోయే కార్యంలా తోచింది వాళ్ళకు. కాని, ధూమకుణ్ణి అవగింజంత సంశయం బాధిస్తూనే వున్నది. కాలశంబరుడు తన మంత్రదండం కోసం, ఏదో యుక్తిపన్ని తమను హతమార్చ చూస్తున్నాడా?




ఏది ఏమైనా, ఎన్ని ఘోరప్రమాదాలను ఎదుర్కోవలసివచ్చినా, తాము రాకుమారి కాంతిసేనను రాక్షసుడి బారి నుంచి కాపాడక తప్పదు. ఇలాంటి దృఢనిశ్చయానికి వచ్చిన ధూమకుడు విందు ముగిసిన తరవాత కొద్దిసేపు విశ్రాంతి తీసుకుని, తిరిగి ప్రయాణం సాగించాడు. ఈసారి ధూమకసోమకులకు తోడుగా విరూపుడు కూడా బయలుదేరాడు. అతడు వెంట బల్లెం, విల్లంబులతో పాటు, పొడవాటి తాడొకటి భుజానికి చుట్టచుట్టి తగిలించుకున్నాడు.

ముగ్గురూ అరణ్యంలో ఒక గంటకాలం ప్రయాణించి ఒక కొండప్రాంతం చేరారు.



కొండపాదాన్ని ఒరుసుకుంటూ నది ఒకటి ప్రవహిస్తున్నది. ముగ్గురూ దాన్ని దాట వలసివున్నది. ముందు నడుస్తున్న విరూపుడు నదిని సమీపించి, ఆశ్చర్యంగా ఒక చిన్న కేకపెట్టి, వెనక గుర్రాల మీద వస్తున్న ధూమకసోమకులను పిలిచాడు. ధూమకసోమకులు గుర్రాలు దిగి, విరూపుణ్ణి సమీపించి, అక్కడ ఎదురైన దృశ్యం చూసి వింతపడ్డారు.

నదీతీరంలో ఏదో భయంకర పోరాటం జరిగిన గుర్తుగా, విరిగిన ఈటెలూ, బాణాలూ, నేల మీద రక్తపుమరకలూ కనిపిస్తున్నవి. నదీతీర మంతా ఆ పోరాడిన వారెవరో కాళ్ళతో మట్టగించి, కలయ తొక్కారు. విరూపుడు అదంతా ధూమక సోమకులకు చూపుతూ, "ఈ ప్రాంతాల నివశించేవాళ్ళు మా జాతివాళ్ళు కాదు, భిల్లులు. వాళ్ళతో మాకు శత్రుత్వం లేక పోయినా, స్నేహం మాత్రం లేదు. ఇక్కడ యింత రక్తపాతానికి కారకులెవరో తెలి యటం లేదు. కొంచెం నది దిగువకు వెళ్ళి వస్తాను, మీ రిక్కడే వుండండి," అంటూ తీరం వెంట ముందుకు వెళ్ళాడు.

ఆ ప్రాంతానా విరూపుడికి కొన్ని కాలి గుర్తులు కనిపించినై. హఠాత్తుగా అతడికి కాలశంబరుడు గుర్తుకొచ్చాడు. ఆయన కేమైనా హాని జరిగిందా? అనుకుంటూ విరూపుడు అతడి పావుకోళ్ళ గుర్తు లేమైనా కనబడతవేమో అని నేల మీదికి వంగి చూసేంతలో, జుయ్ఁమంటూ ఈటె ఒకటి అతడి తలను రాచుకుంటూపోయి, అడుగు దూరంలో నేలలో బలంగా గుచ్చుకున్నది.

విరూపుడు ఒక్క వూపున లేచి నిలబడి వెనక్కు తిరిగి చూసేంతలో మరొక ఈటె అతడి గుండెల మీదికి మెరుపులా దూసుకు రాసాగింది. అతడు చప్పున పక్కకు పడి పోయాడు. ఈటె నదిలో బుడుంగు మంటూ పడిపోయింది. విరూపుడు లేవ




బోయేంతలో, " రాక్షసబంటూ, దొరికావు! నీ పేగులు తీసి మెడలో వేసుకుంటాను," అంటూ ఒక మహాకాయుడైన భిల్లుడు అతడి మీదికి ఎనుబోతులా వచ్చిపడ్డాడు.

విరూపుడు యీ దాడికి సిద్ధంగా లేక పోవటంతో భిల్లు డతన్ని నడుం పట్టుకుని ఒక్క విసురు విసిరేసరికి నీటి ఒడ్డుకు వెళ్ళిపడ్డాడు. మరుక్షణంలోనే భిల్లుడు అతడి గుండెల మీద కూర్చుని, తన బలమైన చేతులతో విరూపుడి కంఠం బిగించి పట్టుకున్నాడు. ఆ సరికి విరూపుడు తెప్పరిల్లి, కాళ్ళతో భిల్లుడి మెడను అడకత్తెరలో బిగించినట్టు బిగించి, బలంగా ఒక్క తోపు



తోశాడు. భిల్లుడు కాస్తా వెళ్ళి నదీజలంలో పడ్డాడు. వాడు నీటి నుంచి లేవకముందే విరూపుడు పులిలా వెళ్ళి మీదపడి, అతడి తలను నీటిలో అదిమి పట్టుకున్నాడు. ఊపిరాడక భిల్లుడు గిలగిలకొట్టుకుంటూ, తల నీటి పైకి వచ్చినప్పుడల్లా, " విరూపా, నన్ను చంపకు. నేను పులిందుణ్ణి!" అంటూ అరవసాగాడు.

ధూమకసోమకులు యీ అరుపులు విని అక్కడికి పరిగెత్తుకు వచ్చారు. వాళ్ళు వచ్చేసరికి విరూపుడు, భిల్లుణ్ణి నీటిలో నుంచి కాళ్ళు పట్టుకుని ఒడ్డుకు యీడ్చుకొస్తున్నాడు. ధూమకు డది చూసి, " విరూపా, ఎవడు వాడు? భిల్లజాతివాడా? ఏం జరిగింది?" అని ప్రశ్నించాడు.

" వీడు నన్ను దొంగచాటుగా చంపాలని చూశాడు. తగిన శాస్తి చేశాను. వీడు చెప్పే పేరు నిజమైతే, వీడు సామాన్య భిల్లుడు కాదు, భిల్లుల నాయకుడు!" అన్నాడు విరూపుడు.

ధూమకసోమకులు భిల్లుణ్ణి సమీపించి, "ఎవడివి నీవు? విరూపుణ్ణి ఎందుకు చంపాలని చూశావు?" అని ప్రశ్నించారు.

భిల్లుడు బొళుక్కుమంటూ యిన్ని నీళ్ళు కక్కి ఆయాసపడుతూ, " రాజ



భటులు నాకు న్యాయం కలిగించాలి! నా పేరు పులిందుడు, భిల్లనాయకుణ్ణి. ఇంతకు ఓగంట ముందు నా పడుచు పదో పెళ్ళాన్ని యీ విరూపుడూ మరికొందరూ కలిసి అపహరించుకుపోయారు. అడ్డొచ్చిన నా వాళ్ళను కొందరిని చంపి, శవాలను నదిలో పారేశారు. ఇతడూ యితడి పరివారం నా భార్యను ఎవడో రాక్షసుడి కోసం ఎత్తుకుపోతున్నట్టు, వాళ్ళ మాటలద్వారా బతికి బయటపడ్డ నా అనుచరులు గ్రహించి, నాకు చెప్పారు," అన్నాడు.



పులిందుడి మాటలు విని అందరూ చాలా ఆశ్చర్యపడ్డారు. ధూమకుడు ఏదో ప్రశ్నించబోయేంతలో విరూపుడు, పులిందుణ్ణి సమీపించి, "నీ భార్యను అపహరించుకుపోయినవాళ్ళల్లో నేనున్నట్టు నీ అనుచరులు చూశారా? వాళ్ళు లోగడ నన్ను ఎరుగుదురా? ఛీ, అబద్ధాలాడకు, యీ బల్లెంతో పేగులు తోడగలను," అంటూ బల్లెం ఎత్తాడు.

ధూమకుడు, విరూపుడి చేయి పట్టుకుని ఆపి, "పులిందా! నీవేదో పొరబడుతున్నావ్. విరూపుడు గత అయిదారు గంటలుగా మాతోనే వున్నాడు. నీవేదో రాక్షసుడన్నావే—వాడి ముఠావాళ్ళు విరూపుణ్ణి అపఖ్యాతి పాలు చేసేందుకు, అతడి పేరు చెప్పి వుంటారు. అంతేకాక, మీ రెండు తెగల మధ్యా శత్రుత్వం రెచ్చకొట్టటం కూడా వాళ్ళ వుద్దేశం అయివుంటుంది. నీవు చెప్పే రాక్షసు డెవరో మాకు తెలుసు. వాణ్ణి హతమార్చటానికే బయలుదేరాం. నీ భార్యను కూడా తప్పక వాడి చెరనుంచి విడిపించుకు వస్తాం," అన్నాడు.

ధూమకుడిలా అనే సరికి పులిందుడు తన పొరపాటు గ్రహించి, విరూపుడి దగ్గరకు వెళ్ళి క్షమించవలసిందిగా కోరాడు. ధూమకసోమకుల ప్రోత్సాహంతో వాళ్ళిద్దరూ పరస్పరం ఆలింగనం చేసుకుని



మిత్రులయారు. ఆ తరవాత ధూమకసోమకులు నది దాట కోరుతున్నారని తెలిసి, పులిందుడు, "అయ్యా, మీ రిక్కడే వుండండి. నేను మా పల్లె రేవు నుంచి రెండు తెప్పలు పంపుతాను. వాటి మీద మీరూ, మీ గుర్రాలూ క్షేమంగా నది దాట వచ్చు," అని చెప్పి పరుగుపరుగున తన పల్లె కేసి వెళ్ళాడు.

కొద్దిసేపటి తరవాత ఇద్దరేసి భిల్లులు రెండు తెప్పలను నదిలో తోసుకుంటూ వచ్చారు. ధూమకసోమకులు ఒక తెప్ప మీద ఎక్కారు. విరూపుడు గుర్రాలతో మరొక తెప్ప ఎక్కాడు. తెప్పలు రెంటినీ భిల్లులు తెడ్లు వేసి తోస్తూ అవతలి ఒడ్డుకు నడపసాగారు. అవి సరిగా నది మధ్యలో వుండగా, ధూమకుడి నడుం నుంచి వేలాడుతున్న కాలశంబరుడి మంత్రదండం, చప్పున పాములా పైకి లేచి, తూర్పు దిక్కు కేసి ముఖంపెట్టి ఏవో కీచుధ్వనులు చేయసాగింది. ఆ వింత చూసి విరూపుడు నివ్వెరపోతూ, ఏమో అనబోయేంతలో, దాపులనున్న కొండశిఖరం మీది నుంచి ఒక నల్లని గరుడపక్షి రివ్వుమంటూ ఆకాశంలోకి లేచి, బాణవేగంతో వచ్చి మంత్రదండాన్ని పామునుకుని ఒక్క తన్నుతో గోళ్ళ మధ్య యిరికించుకుని ఆకాశంలోకి ఎగిరింది. మంత్రదండాన్ని కట్టివుంచిన తాడు బలమైనది కావటంతో, ధూమకుడు కూడా దానితోపాటు పైకి లేచాడు. సోమకుడు ఒక్క కేకపెట్టి బాణం ఎక్కుపెట్టి కూడా, బాణం ధూమకుడికి తగలవచ్చునన్న భయంతో కొయ్యబారిపోయాడు. ఈలోపల విరూపుడు బెదిరిన గుర్రాలను సముదాయించి, "శాంభవీ!" అంటూ కొండలు ప్రతిధ్వనించేలా అరిచి, భుజాన్నుంచి వేలాడుతున్న తాడు ఉచ్చును, గరుడపక్షికి గురిచేసి పైకి విసిరాడు. —(ఇంకా వుంది)





# కలియుగభీముడు

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ లాగా దుర్ఘటమైన పనులు మీద వేసుకుని తాము కోరినది సాధించిన వారు కొందరున్నారు. కాని శశికేతుడి లాగా చేతికందిన ఫలితాన్ని కాలతన్నిన వారెవరూ లేరు. శ్రమ తెలియకుండా నీకు శశికేతుడి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

నవకేతన నగరానికి పుష్పకేతుడనే రాజుండేవాడు. ఆయన ఎంత మంచివాడంటే ప్రజలాయన కోసం ప్రాణాలు వదలటానికి సిద్ధంగా ఉండేవారు. అలాటి పుష్పకేతుణ్ణి సంతానం లేని కొరత ఒకటి చాలా బాధించేది. ఈ బాధను ఆయన చాలా కాలం తన మనసులోనే అణుచుకుని, చిట్ట



చివరకొక రోజున తన పురోహితుడితో చెప్పుకున్నాడు.

రాజపురోహితుడు మహాజ్ఞాని. ఆయన రాజుతో, "మహారాజా, ప్రజలంతా మీ బిడ్డలే కదా! అయినా బిడ్డలు కలగాలన్న కోరిక మీకున్నట్టుగానే ప్రజలకు కూడా ఉండటం సహజం. ప్రజలందరికీ సంతర్పణ చెయ్యండి. వచ్చిన వారినందరి నుంచీ, సుపుత్రుడు కలగాలని ఆశీర్వాదం పొందండి. ప్రజలందరూ మనస్ఫూర్తిగా చేసే ఆశీర్వాదం వృథాపోదు," అన్నాడు.

పుష్పకేత మహారాజు పురోహితుడు చెప్పినట్టే చేశాడు. దేశంలో ఉన్న సమస్త జనానికీ సమారాధన అవిచ్ఛిన్నంగా జరిగింది. భోజనం చేసి వెళ్ళే ప్రతిమనిషి చేతా రాజు ఆశీర్వాదం పొందాడు. అందరి ఆశీర్వాదాలూ ఫలించి, ఏడాది తిరిగేసరికల్లా రాజు కొక చక్కని కొడుకు కలిగాడు. అతనికి శశికేతు డని పేరు పెట్టుకున్నారు.

శశికేతుడికి తండ్రిలోని సద్గుణా లన్నిటితోబాటు, అసాధారణమైన ధైర్యమూ, బలమూ కూడా పెంపొందాయి. యుక్త వయసు రాగానే అతనికి పెళ్ళిచేయ నిశ్చయించి, అనేక దేశాల రాజకుమార్తెలను చూశారు. వారెవరూ అతనికి నచ్చని కారణం చేత, "అప్పుడే నాకు పెళ్ళి దేనికి?" అని శశికేతుడు తాత్సారం చేస్తూవచ్చాడు.

కాని అతనికి పెళ్ళాడా లన్న కోరిక లేక పోలేదు. ఒకనా డతను పురోహితుడి ఇంటికి వెళ్ళి, "స్వామీ, నాకు తగిన కన్య ఎక్కడున్నదో చెప్పగలరా?" అని అడిగాడు.

"నాయనా, రుద్రజట మనే దేశాన్ని పాలించే జితసేన మహారాజు కూతురు తప్ప నీకు భార్య కాదగిన కన్య మరొకతె లేదు," అన్నాడు పురోహితుడు.

ఈ మాట వింటూనే శశికేతుడు తన కత్తి మాత్రమే తీసుకుని, గుర్రమెక్కి,



రుద్రజటానికి బయలుదేరాడు. అతను రాజధానికి చేరి ఒక పేదరాసిపెద్దమ్మ ఇంట బస చేసి, "పెద్దమ్మా, నే నీ దేశపు రాజకుమార్తెను పెళ్ళాడదామని వచ్చాను. ఎవరి ద్వారా ప్రయత్నం చెయ్యమని సలహా ఇస్తావు?" అని అడిగాడు.

పెద్దమ్మ పెద్దగా నిట్టూర్చి, "అయ్యో నాయనా, నీ వంటి వాళ్ళకు వందమందికి ఆ రాజకుమార్తె ఇప్పటికి పెళ్ళి చేసేసింది. వాళ్ళ తలలన్నీ కోటగుమ్మానికి తోరణం లాగా వేళ్ళాడగట్టి ఉన్నాయి. నా సలహా అడిగేటట్టయితే, వచ్చిన దారే మీ దేశానికి వెళ్ళిపో," అన్నది.

"అదేమిటి? అలా ఎందుకు జరిగింది?" అని శశికేతుడు పెద్దమ్మ నడిగాడు.

"ఏం చెప్పమంటావు నాయనా? మా రాజుగా రమ్మాయి నాలుగేళ్ళ పిల్లగా ఉండగా ఎవరో మంత్రగా డెత్తుకుపోయా డని చెప్పుకున్నారు. రెండురోజుల పాటు దేశమంతా అట్టుడికిపోయింది. ఆ తరవాత రాజుగారు చాటింపు వేయించి, తన కుమార్తెను ఎవరూ ఎత్తుకు పోలేదనీ, ఆమె అంతఃపురంలో సురక్షితంగానే ఉన్నదనీ ప్రజలకు తెలియబరిచాడు. రెండేళ్ళ క్రితం ఆ పిల్లకు యుక్తవయసు వచ్చింది. పెళ్ళి



ప్రయత్నాలు ఆరంభించారు. అనేకమంది రాజకుమారులు ఆమె అందచందాలను గురించి విని, పెళ్ళాడతామని వచ్చారు. తనను పెళ్ళాడటానికి రాజకుమార్తె ఒక షరతు పెట్టింది: ఇక్కడికి పదికోసుల దూరాన ఉండే భీమవనంలో కలియుగ భీముడని ఒక డున్నాడు; వాణ్ణి జయించి, వాడి తల నరికి తెచ్చిన వాణ్ణే తాను పెళ్ళాడతా నంటుంది; అలా చెయ్యలేని వాడి తల కొట్టించి, కోటగుమ్మానికి వేళ్ళాడదీయిస్తుంది. అందుచేత నువ్వామెను పెళ్ళాడే ఆలోచన వదులుకో, బాబూ," అన్నది పెద్దమ్మ.






"ఇంత దూరం వచ్చి ఓడిపోయి తిరిగి పోతానా, పెద్దమ్మా? రాజకుమార్తె ఇలా రాజకుమారుల తలలు నరికేస్తుంటే రాజైనా, ఇదేమిటనడా?" అని శశికేతు డడిగాడు.

"ఏం చెప్పమంటావు, నాయనా? ఆ రాజు పిరికివాడు. కూతురంటే భయపడతాడని చెప్పుకుంటారు," అన్నది పెద్దమ్మ.

మర్నాడే శశికేతుడు రాజభవనానికి వెళ్ళి, "నన్ను రాజకుమార్తె పెళ్ళాడుతుందేమో తెలుసుకోవటానికి వచ్చాను," అని రాజుకు కబురుచేశాడు.

అతన్ని భటులు లోపలికి తీసుకుపోయారు. సింహాసనాల మీద ఒక పక్కగా రాజూ, మరొక పక్కగా రాజకుమార్తే కూర్చుని ఉన్నారు. శశికేతుడు మరొక ఆసనం మీద కూర్చుని తాను వచ్చిన పని వాళ్ళకు చెప్పాడు.

రాజకుమార్తె అతని కేసి వెటకారంగా చూస్తూ, "భీమవనంలో ఉండే కలియుగ భీముడి శిరస్సు తెచ్చి నాకు చూపినట్టయితే నేను ఎవరినైనా పెళ్ళాడతాను. అందుకు ఒప్పుకుని వెళ్ళి, కలియుగభీముడి శిరస్సు తేలేకపోయిన వాడి శిరస్సు నరికి మా కోట గుమ్మానికి వేళ్ళాడగట్టిస్తాను," అన్నది.

శశికేతుడు గట్టిగా నవ్వి, "ఆ కలియుగ భీముడి శిరస్సు తేలేకపోతే నా దారిన నేను హాయిగా వెళ్ళిపోతాను గాని, నా శిరస్సును మీ కోట గుమ్మానికి అలంకారంగా ఎందుకిస్తాను?" అన్నాడు.

రాజకుమార్తె అతని కేసి చుర చురా చూస్తూ, "ఇక్కడికే తిరిగి వస్తావు! రాకుండా ఉండటం నీ చేతిలో ఉండదు, తెలిసిందా?" అన్నది.

శశికేతుడు అక్కడి నుంచి బయలుదేరి, తన గుర్రం మీద భీమవనానికి వెళ్ళాడు.

భీమవనం చాలా అందమైనది. అందులోకి చాలా దూరం వెళ్ళాక ఒక ఇల్లు కనబడింది. అతనా ఇంటి ముందుకు వెళ్ళి



తలుపు తట్టేసరికి, ఒక అమ్మాయి వచ్చి తలుపు తీసి, శశికేతుణ్ణి చూసి కొంచెం కంగారుపడి, "ఎవరు మీరు? ఇక్కడ ఏం పని? వెంటనే వెళ్ళిపొండి," అన్నది.

శశికేతుడు ఆమె అందం చూసి క్షణం సేపు నిర్ఘాంతపోయాడు.

"నే నొక పని మీద వచ్చాను. కలియుగ భీము డెక్కడ ఉంటాడో చెప్పగలవా?" అని అత నడిగాడు.

"ఇదే ఆయన ఇల్లు. మీ కాయనతో ఏం పని?" అని ఆమె అడిగింది.

"ఆయనతో యుద్ధం చేసి, ఆయన తల తీసుకుపోయి, రాజకుమార్తెను పెళ్ళాడ తాను," అన్నాడు శశికేతుడు.

"ఆయనను జయించటం ఎవరి తరమూ కాదు," అన్నదామె.

"జయించకపోతే ఆయన చేతిలో ఓడి చనిపోతాను. ఎలాగైనా ఒకటే. నే నాయన తల తీసుకు రాకపోతే రాజకుమార్తె నా తల తీయిస్తుంది," అన్నాడు శశికేతుడు.

"నే నాయన కుమార్తెను. మా తండ్రి ఈ పక్కనే జువ్విచెట్టు కింద నిద్రపోతూ ఉంటాడు," అన్నదామె.

"సరే, వస్తాను," అని శశికేతుడు బయలుదేరుతుండగా ఆమె అతన్ని వెనక్కు పిలిచి, రహస్యంగా, "ఆయన తల దొరికి నట్టయితే దాన్ని ఎక్కడా కింద పెట్టవద్దు. చేతిలోనే పట్టుకుని తిన్నగా నా దగ్గిరికి రండి," అన్నది.

శశికేతుడు ఆమె చూపిన దిక్కుగా వెళ్ళి, జువ్విచెట్టు కింద పడుకుని నిద్ర పోతున్న మహాకాయుణ్ణి ఒకణ్ణి చూశాడు. అతనా కలియుగభీముణ్ణి ఒక్క తన్ను తన్నేసరికి, ఆ మనిషి లేచి కూర్చుని, "ఎందుకు నన్ను లేపావు?" అని అడిగాడు.

"నువే కలియుగభీముడి వైతే, కత్తి తీసుకుని యుద్ధానికి రా," అన్నాడు శశికేతుడు.



కలియుగభీముడు ఏ ఆయుధమూ లేకుండానే కలియబడ్డాడు. శశికేతుడు కూడా కత్తి దూయక, కలియుగభీముడితో బాహాబాహి యుద్ధం సాగించాడు. కొంత సేపు ఇద్దరూ యుద్ధం చేశాక, కలియుగ భీముడు కాస్తా వెల్లికిలా పడిపోయాడు. శశికేతుడు అతని రొమ్ము మీద కాలు పెట్టి నొక్కి, "నీ తల నరికేస్తాను," అన్నాడు.

"నరికెయ్యి. నిన్నెలా ఆపను?" అన్నాడు కలియుగభీముడు.

శశికేతుడు కత్తిదూసి, ఒక్క వేటున కలియుగభీముడి మెడ నరికి, తల చేత పట్టుకుని బయలుదేరాడు.



అతను కొద్ది అడుగులు వేశాడో లేదో, "కా, కా" అని భయంకరంగా అరుస్తూ రెండు మూడు కాకులు అతని ముఖం మీదికి వచ్చాయి.

వెంటనే శశికేతుడు కలియుగభీముడి తలను జారవిడిచి, తన చేతులు రెండూ ముఖానికి అడ్డం పెట్టుకున్నాడు. అతను చేతులు అడ్డం తీసి చూస్తే, కాకులూ లేవు, కలియుగభీముడి తలా లేదు.

ఏమి చెయ్యాలో తోచక శశికేతుడు భీమవనంలో కొద్దిసేపు తిరిగి, కలియుగ భీము డింటికి వెళ్ళి, అతని కుమార్తెతో జరిగినదంతా చెప్పాడు.

ఆమె నవ్వి, "ఇంత పరాక్రమవంతు డివి, కాకులకు భయపడి నా సలహా మరి చావా? ఈసారి కలియుగభీముడి తల నరికినప్పుడు, దాన్ని వదలకుండా చేత పట్టుకుని నా దగ్గిరికి రా!" అన్నది.

శశికేతుడు మళ్ళీ జువ్విచెట్టు కిందికి వెళ్ళేసరికి, కలియుగభీముడు ఏమీ జరగ నట్టు నిద్రపోతున్నాడు. శశికేతు డతన్ని తన్ని లేపి, అతనితో యుద్ధం చేసి, పడతోసి, మళ్ళీ తలనరికి చేత పట్టు కుని, తిన్నగా కలియుగభీముడి కూతురు దగ్గిరికి వెళ్ళాడు.





ఆమె అతని చేతిలో ఉండే తలను చూసి, "ఇక నువు చెయ్యవలసిందేమంటే, ఈ తలను తీసుకుపోయి రాజకుమార్తెకు చూపించి, ఇది కలియుగభీముడి తలేనని అందరి ముందూ ఆమె చేత ఒప్పించు. ఆమె దానిని తన కివ్వమంటుంది, కాని ఇవ్వకు. అ తలను అప్పుడే నరికి ముక్కలు చేసి, దహనం చేసెయ్యి. అ తరవాత నువు రాజకుమార్తెను పెళ్ళాడటానికే ఆటంకమూ ఉండదు. అంతకన్న ముఖ్యమేమంటే, ఈ రాజకుమారుల అకాలమరణాలను అరికట్టిన వాడి వవుతావు," అన్నది.

"నేను తిరిగి వస్తాను. నువ్విక్కడే ఉంటావు గదా?" అన్నాడు శశికేతుడు.

తల ఊపి ఆమె లోపలికి వెళ్ళిపోయింది.

శశికేతుడు కలియుగభీముడి తలను పట్టుకుని, గుర్రం మీద రాజధానికి చేరే సరికి రాత్రి పొద్దుపోయింది. చలికాలం కావటంచేత రాజభవనం ముందు కాపలా వాళ్ళు చలిమంట వేసుకుంటున్నారు.

శశికేతుడు రాజభవనంలోకి వెళ్ళి రాజకుమార్తె కోసం కబురు చేశాడు. ఆమె వచ్చింది. "ఇదుగో, కలియుగభీముడి తల తెచ్చాను. సరిగా చూసి గుర్తించు," అన్నా డతను.



రాజకుమార్తె తల కేసి చూసి, "ఇది కలియుగభీముడి తలే. నీ శపథం నిలబెట్టుకున్నావు. దాన్ని నా కిచ్చెయ్యి," అన్నది.

"దాన్ని నీ కివ్వాలన్న షరతేమీ లేదు," అంటూ శశికేతుడు బయటికి నడిచాడు.

"దాన్ని నా కిచ్చెయ్యి. కోట గుమ్మానికి అలంకారంగా తగిలిస్తాను. నువ్వేం చేసుకుంటావు?" అంటూ రాజకుమార్తె అతని వెంటపడింది.

శశికేతుడు తిన్నగా చలిమంట దగ్గిరికి వచ్చి, కత్తితో తల నుంచి చిన్న చిన్న ముక్కలు నరికి మంటలో వెయ్యసాగాడు. రాజకుమార్తె కెవ్వన అరిచి, అతని మీద

కలిసుబడి, కలియుగభీముడి తలను బల వంతాన లాక్కోబోయింది. అతను తలను దూరంగా ఎడంచేత పట్టుకుని, కుడి చేతిలో ఉన్న కత్తిని బలంగా విసిరి, రాజ కుమార్తెను రెండుగా నరికాడు. తరవాత అతను కలియుగభీముడి తలను పూర్తిగా అగ్నిప్రీతి చేసి, గుర్ర మెక్కి తిరిగి భీమ వనానికి వెళ్ళాడు.

కలియుగభీముడి కుమార్తె అతన్ని తిరిగి చూసి ఆనందబాష్పాలు రాల్చింది. అత నామెకు జరిగినదంతా చెప్పి, ఆమెను తన గుర్రం మీద ఎక్కించుకుని తన నగరానికి వెళ్ళి, అక్కడ ఆమెను వైభవంగా పెళ్ళాడి, సుఖంగా ఉన్నాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, అంత శ్రమపడి కలియుగభీముడి తల తెచ్చిన రాజకుమారుడు రాజకుమార్తెను పెళ్ళాడక కలియుగభీముడి కుమార్తె నెందుకు పెళ్ళా డాడు? కలియుగభీముడి కుమార్తె తన తండ్రి చావుకు ఎందుకు సహాయపడింది? పురోహితుణ్ణి సలహా అడిగి బయలుదేరిన రాజకుమారుడు ఆ సలహా ప్రకారం ఎందుకు నడుచుకో లేదు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శశికేతుడు పురోహితుడి సలహాను అక్షరాలా పాటిం చాడు. కలియుగభీముడు రాజకుమార్తెను చిన్నతనంలో ఎత్తుకుపోయిన మాంత్రికుడు. బహుశా రాజకుమార్తెగా నటిస్తున్నది ఆ మాంత్రికుడి కూతురయి ఉంటుంది. అన్ని ఏళ్ళుగా మాంత్రికుడి వద్ద బందీగా ఉన్న రాజకుమార్తె అతన్ని నాశనం చెయ్య టానికి ప్రయత్నించటంలో ఆశ్చర్యం లేదు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)






# శాపవిముక్తి

ఒక గ్రామంలో ఒక సామాన్యపు రైతు ఉండేవాడు. అయనకు ముగ్గురు కూతుళ్ళుండేవాళ్ళు. వాళ్ళకు పెళ్ళియీడు వచ్చినప్పటికీ ఇంకా పెళ్ళిళ్ళు కాలేదు. వాళ్ళ పెళ్ళిళ్ళ కోసమే రైతు అహోరాత్రాలు శ్రమపడి, డబ్బు కూడబెట్టుతున్నాడు.

సంక్రాంతికి బస్తీలో పెద్ద సంత జరుగుతుంది. అక్కడ తన గిత్తను అమ్ముదామని బయలుదేరుతూ తన కూతుళ్ళను పిలిచి, "సంత నుంచి మీ కేమేం తీసుకురమ్మన్నారు?" అన్నాడు.

పెద్దకూతురు, "నాకు వెన్నెలరంగు చీరె పట్టుకురా, నాన్నా," అన్నది.

రెండోకూతురు, "నాకు ఎండరంగు చీరె పట్టుకురా, నాన్నా," అన్నది.

మూడేకూతురు తన కేమీ అక్కర్లేదన్నది. "అదేమిటి, తల్లీ? నీ అక్కలిద్దరికీ చీరెలు కొనితెస్తూ నీ కేమీ తీసుకురాకుండా ఉండటానికి నా ప్రాణం ఒప్పుతుందా?' అన్నాడు రైతు.

"సరే, నా పేరు మల్లిక కనక నాకో మల్లెపూవు పట్టుకురా, అంతకన్న ఏమీ అక్కర్లేదు," అన్నది మూడోకూతురు.

అది ఇంకా మల్లెపూల తరుణం కాదు. ఆ సంగతి మల్లికకు గుర్తు రాలేదు; సంతకు వెళ్ళే దారిలో రైతుకు గుర్తొచ్చి చాలా బాధపడ్డాడు. "బస్తీలో ఏ సంపన్నుల ఇంటనైనా అకాలంగా పూసే మల్లెమొక్క లున్నాయేమో విచారించి, అమ్మాయికి మల్లెలు పట్టుకుపోవాలి," అనుకున్నా డాయన.

సంతలో గిత్త అమ్ముడయింది. రైతు తన పెద్దకూతుళ్ళకు చీరెలు కొన్నాడు. మల్లెల కోసం ఊరంతా చెడతిరిగి, ఎక్కడా ఒక చిన్న మల్లెమొగ్గ నయినా సంపాదించలేక, నిస్పృహ చెంది, సూర్యాస్తమయం వేళకు ఇంటిదారి పట్టాడు రైతు. అదే

పి. మనోహరరావు



సమయానికి ఆకాశం నిండా కారుమేఘాలు కమ్మి, పెద్దపెట్టున వీచే గాలితోబాటు వర్షం ఆరంభమయింది. దాంతో అంధకారం ముంచుకొచ్చింది.

రహదారిన పోతే త్వరగా ఇల్లు చేరలే ననుకుని, రైతు అడ్డదారి పట్టి బీళ్ళ మీదుగా నడక సాగించాడు. వాన మూలంగానూ, కన్నుపొడుచుకున్నా కనిపించని చీకటి మూలంగానూ రైతు దారి తప్పాడు. ఎంత దూరం పోయినా గ్రామం రాదు. రైతు తడిసి ముద్ద అయిపోయాడు. ఈదురుగాలి కత్తిలాగా కోసేస్తున్నది. ఎవరినన్నా అడుగుదామన్నా నరసంచారం లేదు.



ఈ పరిస్థితిలో రైతుకు అంత దూరాన దీపం కనిపించింది. బతుకుజీవుడా అని ఆయన ఆ దీపం కేసి నడిచి, ఒక పెద్ద రాజభవనానికి వచ్చాడు. ఆ ప్రాంతాల అటువంటి రాజభవనం ఉన్నట్టు కూడా రైతు ఎరగడు. లోపలికి పోతే ఏ ద్వార పాలకులో అడ్డుపెడతారని ఆయన అనుకున్నాడు. కాని ద్వారం వద్ద ఎవరూ లేరు. రైతు లోపలి ఆవరణ దాటి భవంతిని సమీపించాడు. అక్కడా ఎవరూ లేరు. "లోపల ఎవరండీ?" అని గట్టిగా కేక పెట్టినా జవాబు లేదు. భవంతిలో తలుపులన్నీ భార్లా తెరిచి ఉన్నాయి. లోపల ఏ గదిలోనూ ఏ ఒక్కరూ లేరు. కాని ఇల్లంతా శుభ్రంగా, ఎవరో కాపురం ఉంటున్న ఇల్లులాగే ఉంది.

గదులన్నీ తిరుగుతూండగా ఒక పక్క నుంచి రైతుకు కమ్మని వంటకాల వాసన తగిలింది. అటుగా వెళ్ళి చూస్తే, పెద్ద వంటగదీ, అందులో తయారై తినటానికి సిద్ధంగా ఉన్న వంటకాలూ కనిపించాయి. రైతుకు ఆకలి దహించుకు పోతున్నది. అందుచేత ఆయన మొహమాట పడక వంటకా లన్నీ వడ్డించుకుని, కడుపునిండా తినేశాడు.



వంటఇంటి పొయ్యిలలో ఇంకా చాలా వేడి ఉన్నది. తన తడిబట్టలన్నీ పిండి, ఆ పొయ్యిల దగ్గిర ఆరవేసి, రైతు పడక గదికి వెళ్ళి, ఒక హంసతూలికాతల్పం పైన పడుకుని హాయిగా నిద్రపోయాడు. ఆయన తెల్లవారుతూనే లేచి, ఆరిన తన బట్టలు కట్టుకుని, శలవు పుచ్చుకోవటాని కెవరైనా కనిపిస్తారా అని మరొకసారి భవనమంతా చూశాడు. ఎవరూ కనిపించకపోయే సరికి ఆయన వెళ్ళిపోవటానికి బయలుదేరాడు. ఆయన భవంతిలో నుంచి బయటికి అడుగు పెడుతుండగానే ఆవరణలో ఒక పక్కగా మల్లెపొద ఒకటి కనిపించింది. దాని నిండా మల్లెమొగ్గ లున్నాయి!

రైతుకు పరమానంద మయింది. ఆయన గబగబా పెద్దపెద్ద మొగ్గలను కోయసాగాడు. అంతలోనే జరజరా ఏదో పాకిన శబ్ద మయింది. ఒక రాక్షసిబల్లి లాటిది పొద వెనుక నుంచి పాకి వచ్చి, రైతు కేసి ఎర్రటి కళ్ళతో క్రూరంగా చూస్తూ, మనిషిభాషలో, "దుర్మార్గుడా, నా యింటికి వచ్చి, నా తిండి తిని, నా మంచం మీద పడుకుని నిద్ర పోయినది చాలక, పోతూ పోతూ నా మల్లె పూలను నా అనుమతి లేకుండా కోస్తావా? నీ ఆయువు తీరింది!" అన్నది.




రైతు భయంతో వణికిపోతూ, రెండడు గులు వెనక్కు వేసి, "నాది పొరపాటే. క్షమించండి. కోసినపూలకు డబ్బిచ్చు కుంటాను. నా దగ్గిర ఉన్నదంతా పుచ్చు కోండి కావలిస్తే!" అన్నాడు.

"అధికప్రసంగం! నీ కెవరైనా కూతు ళ్ళున్నారా?" అని అడిగింది రాక్షసిబల్లి.

"ముగ్గు రున్నారండి. మా మూడోదాని కోసమే కోశానీ మల్లెపూలు," అన్నాడు రైతు తడబడుతూ.

"అయితే చూడు, నీకు వారంరోజులు గడువిస్తున్నాను. పై వారం ఇదే రోజుకు నీ కూతుళ్ళలో ఒకతెను తెచ్చి నాకు అప్ప




గించు, లేదా నీ ప్రాణమైనా అర్పించు. తెలిసిందా?" అన్నది బల్లి. రైతు తెలిసిందంటూ తలవూపాడు.

"కోసిన మల్లెలేవో నువే వుంచుకో. నీ కూతురు వచ్చి మల్లెమొగ్గ ఒకటి తుంచగానే నేను వస్తాను. బుద్ధిగల దైతే నేను చెప్పినట్టు వింటుంది. లేదా, ఏం జరగాలో అదే జరుగుతుంది," అన్నది బల్లి మళ్ళీ.

మరుక్షణమే అది ఎటో వెళ్ళిపోయి మాయమయింది. రైతు ప్రాధేయపడే అవకాశం కూడా లేదు. ఈ రాక్షసిబల్లి వాత పడటానికి తన కూతుళ్ళలో ఎవతె ఒప్పుకుంటుంది? ఎవతె అయినా ఒప్పుకున్నా దాని గతి ఏమవుతుంది? "ఎంత పెద్ద పీడ వచ్చి పడిందిరా, భగవంతుడా!" అనుకుంటూ రైతు, దారి తెలుసుకుంటూ తన ఇల్లు చేరుకున్నాడు.

అక్కచెల్లెళ్ళు ముగ్గురికీ వారు కోరినవి లభించాయి. అయితే మల్లిక కోరిన మల్లెపూలు ఎలాటి ప్రమాదానికి దారితీశాయో రైతు తన కూతుళ్ళకు వివరంగా చెప్పి, "ఆ రాక్షసిబల్లి పాల మీలో ఎవరు పడతారు?" అని అడిగాడు.

"అమ్మయ్యో, ఆ బల్లిని చూస్తేనే నా పై ప్రాణాలు పైనే పోతాయి," అన్నది పెద్దకూతురు.

"ఇదంతా మల్లిక చేసిన పనే. కాలం గాని కాలంలో మల్లెపూలు కోరటమేం?" అన్నది రెండోది.

"అవును, నా తప్పే. నేనే ఆ బల్లిపాల పడతాను," అన్నది మల్లిక, దుఃఖాన్ని దిగమింగుకుంటూ.

సరిగా ఏడోరోజున రైతు మల్లికను వెంటబెట్టుకుని నిర్జన రాజభవనానికి వచ్చాడు. ద్వారాలన్నీ వెనకటి లాగే బార్లా తెరిచి ఉన్నాయి. ఎక్కడా మనుషులున్న సూచన లేదు. మల్లిక తిన్నగా మల్లెపొద వద్దకు వెళ్ళి, ఒక మల్లెమొగ్గ కోసింది.

వెంటనే బల్లి ప్రత్యక్షమయింది. దాని ఎర్రని కళ్ళూ, ముడతలు పడి, నూనె మెరుగు కలిగిన దాని చర్మమూ, అసహ్యాకరమైన ఎర్రని నోరూ చూసేసరికి మల్లికకు శరీరమంతా గగుర్పొడిచింది. ఆమె నిలువునా వణికింది.

"నీ పేరేమిటి?" అని బల్లి మృదువుగా అడిగింది. దాని కంఠంలో గాని, చూపులో గాని క్రూరత్వం ఏమీ లేదు.

"మల్లిక," అని మల్లిక జవాబిచ్చింది.

"చూడు, మల్లికా. నీ కిక్కడ ఏ ప్రమాదమూ ఉండదు. వివేకంగా మసలుకున్న పక్షంలో నీకు బోలెడంత సుఖం కూడా లభించవచ్చు. ఈ భవనంలో నీకు ఏ లోటూ లేకుండా జరుగుతుంది. ఇక్కడ నువు యథేచ్ఛగా ఉండవచ్చు. నాతో ఎప్పుడు మాట్లాడాలనిపించినా, ఒక మల్లె మొగ్గ తుంచావంటే నేను వస్తాను," అంటూ బల్లి పొదచాటుకు వెళ్ళి మాయమయింది.

రైతూ, మల్లికా మూడు రోజులు ఆ భవనంలో గడిపారు. ఆ కాలంలో వారి కక్కడ ఎవరూ కనిపించలేదు. కాని మూడు పూటలా వంట అవుతూనే ఉన్నది. వాళ్ళకు ఏ లోటూ లేదు.




"ఇక నువు ఇంటికి వెళ్ళిపో, నాన్నా. అమ్మా, అక్కలూ నీ కోసం దిగులు పడిపోతారేమో," అన్నది మల్లిక రైతుతో. రైతు కూడా, తా నక్కడ ఇంక ఉండి పోవటం భావ్యం కాదనుకుని, ఇంటికిపోయి, తన వ్యవసాయపు పనులలో నిమగ్నుడయాడు.

తండ్రిని బయటి ద్వారందాకా సాగనంపి, మల్లిక లోపలికి తిరిగి వస్తూ, మల్లె పొద దగ్గిరికి వెళ్ళి, ఒక మొగ్గ కోసింది. వెంటనే రాక్షసిబల్లి పొద వెనక నుంచి వచ్చింది.

ఆ బల్లిని చూస్తుంటే మల్లికకు జాలి వేసింది. అదేదో కష్టంలో ఉన్నట్టు ఆమెకు



తోచింది. ఆ కష్టం తొలగించటానికి తా నేమైనా చేయగలిగితే బాగుండునని ఆమె అనుకున్నది.

ఆమె బల్లితో, "నాకూ, మా నాన్నకూ మీరిచ్చిన ఆతిథ్యానికి చాలా కృతజ్ఞురాలిని. ఆయనను పంపించేశాను. నేను శాయ శక్తులా మీకు విధేయురాలినిగా ఉంటాను," అని చెప్పింది.

"ఈ మాటలు నిజంగా మనస్ఫూర్తిగానే అంటున్నావా, మల్లికా? నువు చాలా అంద మైన దానివి, నా వికారాకారం చూస్తే నీకు అసహ్యం పుట్టక పోవటం ఎంత ఆశ్చర్యం! నీది ఎంత మంచి హృదయం!" అన్నది బల్లి. దాని కంట కన్నీరు కారణం చూసి మల్లిక హృదయం ద్రవించింది.

"మిమ్మల్ని చూస్తే నాకేమీ అసహ్యం లేదు. నేను మీ పట్ల ఎంతో స్నేహంగా ఉంటాను. ఏం జరిగినా సరే, నేను ఈ ఇల్లు వదలను, మిమ్మల్ని విడిచి పుచ్చను," అన్నది మల్లిక.

"చూడు, మల్లికా! నీ మీదే నా ఆశ లన్నీ పెట్టుకున్నాను. వచ్చే అమావాస్య వెళ్ళిన మర్నాడు బయలుదేరి మీ పుట్టింటికి వెళ్ళటానికి నీకు అనుమతి ఇస్తున్నాను. వెళ్ళి, అక్కడ మూడు రోజులుండి, మూడో రోజే బయలుదేరి వచ్చెయ్యి. ఈ మూడు రోజులూ నీ కోసం నిరీక్షిస్తూ ఉంటాను. మూడో రోజుకు రాకపోయావో నేను మంటలోపడిన మిడతలాగా అయి పోతాను. నీలో నమ్మకం ఉంచి నిన్ను వెళ్ళనిస్తున్నాను. నన్ను మోసగించకు," అన్నది బల్లి.

అమావాస్య వెళ్ళింది. పాడ్యమినాడు మల్లిక తన తండ్రి ఇంటికి బయలుదేరి వెళ్ళింది. ఆమెను చూడగానే ఆమె తల్లి దండ్రులూ, అక్కలూ పొందిన ఆనందం అంతా ఇంతా కాదు. మల్లిక ప్రాణాలతో తిరిగి తమ కంట పడుతుందని వాళ్ళు



కలలో కూడా అనుకోలేదు. వాళ్ళు మల్లి కను బల్లి గురించి రకరకాల ప్రశ్నలు వేశారు. ఆ బల్లి క్రూరమైనది కాదనీ, దాన్ని చూస్తే ఎటువంటి వారికైనా గుండె తరుక్కు పోతుందనీ, దాని వెనక ఉన్న రహస్య మేమిటో తనకు తెలియలేదనీ మల్లిక వాళ్ళకు చెప్పింది.

మల్లిక చెప్పిన మాటలతో వాళ్ళకు బల్లి భయం పూర్తిగా తీరిపోయింది. మూడు రోజులూ మూడు నిమిషాలలాగే గడిచి పోయాయి. మూడో రోజు సాయంకాలం మల్లిక బయలుదేరుతాననంటే, అందరూ చేరి ఆమెను నిర్బంధించి మూడో రాత్రి కూడా ఉంచేశారు.

నాలుగో రోజు ఉదయాన కూడా మల్లిక బయలుదేరలేక పోయింది. భోజనం చెయ్య కుండా వాళ్ళామెను వెళ్ళనివ్వలేదు. మల్లిక భోజనం చేసి బయలుదేరి రాజభవనాన్ని చేరుకునేసరికి సాయంకాలం కానే అయింది.

ఆమె ఆవరణలోకి అడుగు పెడుతూనే మల్లెపొద వాడుముఖం పట్టి ఉండటం గమనించి, ఆత్రంగా దాన్ని సమీపించింది. పొద మీద ఒకే ఒక మల్లె మొగ్గ మిగిలి ఉన్నది. మల్లిక దాన్ని కోసింది, కాని బల్లి అక్కడికి రాలేదు.



ఏం ప్రమాదం జరిగిందో తెలుసుకోలేక మల్లిక భయపడి అటూ ఇటూ చూసింది. ఒక పక్క నుంచి మూలుగులాటిది విన పడింది. మల్లిక అటు కేసి పరిగెత్తి వెళ్ళి, కొనప్రాణంతో ఉన్న బల్లిని చూసి, "ఆలస్యంగా వచ్చినందుకు క్షమించాలి," అన్నది కళ్ళనీళ్ళతో.

"నీ మూలంగా చచ్చిపోతున్నాను, మల్లికా. నా ప్రాణాలన్నీ నీ మీదే పెట్టు కున్నాను. నిన్ను చూడక బతకలేను!" అన్నది బల్లి హీనస్వరంతో.

"నేను వచ్చాను గద! చావవద్దు! ఇక మీ కెలాంటి కష్టమూ రాదు," అంటూ



మల్లిక అప్రయత్నంగా ఆ బల్లిని తన చేతులలోకి తీసుకోబోయింది.

ఆమె చేతులు తగలగానే బల్లి మాయమై పోయి ఒక యువకుడు నిలబడ్డాడు. అతనిలో రాజకుమారుడికి ఉండదగిన లక్షణాలన్నీ ఉన్నాయి. ఈ మార్పు చూశాక మల్లి నోట మాట రాలేదు.

"మల్లికా, తగిన కారణం ఉండే నేనీ భయంకర శాపానికి గురి అయాను. నేను అస్తమానమూ సుఖాలలోనూ, యుద్ధాలలోనూ మునిగితేలాను. దయాదాక్షిణ్యాలనేవి ఎలా ఉంటాయో ఎరగను. దానధర్మాలు చేసినవాణ్ణి కాను. చింకిపాతలు ధరించిన బిచ్చగాళ్ళంటే నాకు తగని మంట. ఒక రోజు ఒక బిచ్చగాణ్ణి తిట్టాను. వెంటనే నాకు పరమ అసహ్యమైన జంతువు ఆకారం వచ్చేసింది. నేను శాపగ్రస్తుణ్ణి అయాను. దాని ఫలితంగా నా రాజభవనం దారేపోయే వారందరికీ వసతిగృహమయింది. నేను మాత్రం నేలబొరియలో నివాసం ఏర్పాటు చేసుకున్నాను. ప్రేమ చిహ్నంగా భవంతి ముందొక మల్లెపొద వెలిసింది. ఆ పొద మీది తొలిమొగ్గ ఏ ఆడదానికి చేరుతుందో ఆ స్త్రీ నన్ను చూసి అసహ్యపడకుండా, స్నేహభావంతో నన్ను తాకిన నాడు నాకు శాపవిమోచనం కావలిసి ఉన్నది. అలా జరగని పక్షంలో నేనీ బల్లి రూపంతోనే చావవలిసి వచ్చేది, నన్ను స్నేహభావంతో చూడలేకపోయిన స్త్రీ కూడా నాతోపాటు చనిపోయి ఉండేది," అని రాజకుమారుడు మల్లికకు తెలిపాడు.

వారిద్దరూ కలిసి మల్లెపొదను సమీపించే సరికి, అది తిరిగి నవనవ లాడుతున్నది. దాని నిండా మొగ్గలున్నాయి. త్వరలోనే రాజభవనం జనంతో నిండిపోయింది. రాజకుమారుడికీ, మల్లికకూ వివాహం జరిగింది. దానికి వచ్చిన మల్లిక తల్లిదండ్రులూ, అక్కలూ రాజభవనంలోనే ఉండిపోయారు.





# కన్నుమూయనివాడు

కాశ్మీరదేశంలో ప్రవర్తన మహారాజుకు కొడుకులు లేరు. పద్మిని అని ఒక కుమార్తె ఉండేది. ఆయనకా కుమార్తె అంటే పంచప్రాణాలు. తండ్రి గారాబంగా పెంచటం చేత పద్మిని కాస్త ఆకతాయిగా పెరిగింది.

ఒకసారి ప్రవర్తనుడు తన సామంతులతో సహా యవనులతో యుద్ధానికి బయలుదేరవలసి వచ్చింది. ఆయన తాను తిరిగి వచ్చేదాకా పద్మినిని వెయ్యికళ్ళతో కనిపెట్టి ఉండమని ఆమె చెలికత్తెలకు చెప్పి, యుద్ధానికి బయలుదేరాడు.

తండ్రి వెళ్ళిపోయ్యాక పద్మినికి మరింత స్వేచ్ఛ దొరికినట్టయింది. ఆమె రోజూ ఉద్యానవనంలో ఉండే కొలనులో జలక్రీడలాడేది. చెలికత్తెలు వద్దంటున్నా చెల్లెక్కేది.

ఇలా కొద్ది రోజులు గడిచాక పద్మినికి ఒక వెర్రిఆలోచన వచ్చింది. రాజభవనానికి కొంత దూరంలో ఒక పెద్ద మడుగున్నది. ఆ మడుగూ, దాని చుట్టూ ఉండే చెట్లూ అడవీ ఒక గంధర్వుడిదని చెప్పుకునేవారు. అందులోకి ఎవరూ దిగి స్నానాలు చేసేవారు కారు. ఈ సంగతి పద్మినికి కూడా తెలుసు. పద్మినికి ఆ మడుగులో ఈతకొట్టాలనిపించింది. ఆ సంగతి ముందుగా తన చెలికత్తెలకు చెప్పక, వారిని అటుగా షికారు తీసుకుపోయి, వారు లబలబలాడుతున్నా వినిపించుకోకుండా అందులోకి దిగి, మడుగు మధ్యకు ఈదుతూ పోసాగింది.

చెలికత్తెలకు ఏం చెయ్యాలో తోచలేదు.

"ఏమయితే అయింది? మనమందరమూ ఈదుకుంటూ పోయి రాజకుమార్తెను బలవంతాన బయటికి ఈడ్చుకొద్దాం," అనుకుని, చెలికత్తెలు కూడా మడుగులోకి ప్రవేశించి, మధ్య కేసి ఈదసాగారు.

వాళ్ళు నాలుగుబారలు వేశారో లేదో, పద్మిని కెవ్వన రెండు మూడుసార్లు అరిచి,

జె. నారాయణప్రసాద్



నీటిలోకి మునిగి పోయింది. చెలికత్తెలు గుండెలు దడదడలాడుతూ తిరిగి ఒడ్డుకు వచ్చేశారు. వాళ్ళు మడుగు ఒడ్డున చాలా సేపు నిలబడ్డారు. కాని పద్మిని జాడలేదు.

మర్నాడు ఉదయానికి పద్మిని తనంతట తానే తడిబట్టలతో ఇల్లు చేరుకున్నది. తన చెలికత్తెలు ఎంత గుచ్చి గుచ్చి అడిగినా ఆమె జరిగిన సంగతి చెప్పలేదు.

ఈ సంఘటన జరిగిన ఆరుమాసాలకు ప్రవర్ధన మహారాజు యుద్ధాల నుంచి తిరిగి వచ్చాడు. పద్మినీ, చెలికత్తెలూ ఆయనకు ఎదురు వెళ్ళారు. పద్మిని అప్పటికి ఆరు మాసాల గర్భిణి. అది చూసి తండ్రి, "ఏం జరిగింది? నా వంశాని కెలా అపకీర్తి తెచ్చావు?" అని కఠినంగా అడిగాడు.

పద్మిని తల వంచుకుని తండ్రికి జరిగిన సంగతి దాచకుండా చెప్పేసింది. తాను తన చెలికత్తెలను ధిక్కరించి, అరణ్యం మధ్య ఉండే గంధర్వుడి మడుగులోకి ఈతలు కొట్టబోయింది; అక్కడ తనను గంధర్వుడో, నాగుడో, యక్షుడో, మరెవడో పట్టుకుని, మడుగు దిగువన ఉండే తన భవనానికి తీసుకుపోయి, బలాత్కరించాడు; మర్నాడు ఉదయం వాడు విడిచిపెట్టితే ఆమె ఇంటికి తిరిగి వచ్చేసింది.

తన కుమార్తె బుద్ధిపూర్వకంగా తప్పు చెయ్యలేదని గ్రహించి, తండ్రి ఆమెను క్షమించాడు. సకాలంలో ఆమె ఒక మగ బిడ్డను కన్నది. వాడిలో ఏ అవలక్షణం గాని ఉన్నట్టు కనబడలేదు. ప్రవర్ధనుడు వాడికి తానే తాతా, తండ్రీ అయి, వాణ్ణి ఎంతో ప్రేమగా పెంచసాగాడు. వాడికి ప్రగల్భుడు అని పేరు పెట్టారు.

ప్రగల్భుడికి పదిహేను, పదహారేళ్ళు వచ్చాయి. వాడి చదువు పూర్తి అయింది. ఒకనాడు ప్రవర్ధనుడు తన మనమడితో బాటు వనవిహారానికి వెళ్ళి, అలిసిపోయి చలపరాతి అరుగు మీద చతికిలబడ్డాడు.

వెంటనే ప్రగల్భుడు, "తాతా, నేను చాలా కాలంగా చూస్తున్నాను. నువు ముసలి వాడివయావు. నీ కిరీటం నా నెత్తినా, రాజ్యభారం నా భుజాల మీదాపెట్టి, హాయిగా ఇంట్లో కాలిమీద కాలేసుకు కూర్చుని విశ్రాంతి తీసుకో," అన్నాడు.

ప్రవర్థన మహారాజు ఈ మాటను బాల్య చాపల్యం కింద జమకట్టి, "తొందరపడ తావేంరా? నా తరవాత రాజ్యం నీకు గాక ఇంకెవరికి పోతుంది? నువే నా వార సుడివి," అన్నాడు ఓర్పుగా.

మరొకసారి కూడా ఇలాగే జరిగింది. చాలాసేపు ఉద్యానంలో నడిచిన మహా రాజు, కాళ్ళు నొచ్చి, ఒక అరుగు మీద కూర్చున్నాడు.

ప్రగల్భుడు చిరాకుపడుతూ, "నువు నడవను కూడా లేవు. నాకు పట్టం కట్టి విశ్రాంతి తీసుకో," అన్నాడు.

"ఒరే, చిలిపి వెధవా! ఈ ఆలోచనలు నీకెవరు చెబుతున్నారో గాని, వాళ్ళు నీ మంచి కోరినవాళ్ళు మాత్రం కారు. నేను బతికి ఉండగా నా సింహాసనం మీద మరొకడు కూర్చునేమాట కల్ల. నా అనంతర మంటావా, ఆ సింహాసనం తప్పక నీదే అవుతుంది," అన్నాడు ప్రవర్థన మహారాజు.



"సింహాసనాన్ని నువు ఇష్టపడి ఇవ్వక పోతే బలవంతాన లాక్కోవలిసి వస్తుంది. అంతే!" అంటూ ప్రగల్భుడు కోపావేశంతో అక్కడి నుంచి ఇంటికి వెళ్ళిపోయి, "అమ్మా, నేను వెళ్ళిపోతున్నాను," అన్నాడు. తల్లి కారణమడిగితే, తాత తనకు పట్టం కట్టటం లేదన్నాడు. ఆమె కూడా వాడి మాటలను తెలిసీ తెలియని మాటల కిందనే జమకట్టింది.

కాని ప్రగల్భుడు నిజంగానే వెళ్ళి పోయాడు. అతను రెండు మూడు రోజులు ప్రయాణించి సుపర్ణుడనే చిన్న రాజు వద్దకు వెళ్ళి, ఉద్యోగం అడిగాడు.



"ఎవరునువ్వు? ఏం ఉద్యోగం చేస్తావు? ఎంత జీతం కావాలి?" అని సుపర్ణుడు ప్రగల్భుణ్ణి అడిగాడు.

"నే నెవరైతేనేం? ఏ పని చెప్పినా చేస్తాను. జీతం సంగతి ఇప్పుడేమీ అడగను. ఒక ఏడాది మీ దగ్గిర పని చేస్తాను. నా పని మీకు తృప్తిగా లేకపోతే ఏమీ ఇవ్వవద్దు; తృప్తిగా ఉంటే నే నడిగినది ఇవ్వండి," అన్నాడు ప్రగల్భుడు.

సుపర్ణుడు సరేనన్నాడు.

మనమడు కళ్ళఎదట లేకుండా పోయాక ప్రవర్ధనుడిలో సంతాన వాంఛ తల ఎత్తింది. ఆయన తన నగరానికి సమీపంలోనే ఉన్న ఒక కాపు కుమార్తెను, చంపకవతి అనే దాన్ని పెళ్ళాడాడు.

ఏడాది గడిచింది. సుపర్ణుడు ప్రగల్భుడి సేవతో పూర్తిగా తృప్తిపడ్డాడు.

ప్రగల్భుడు అతని వద్దకు వచ్చి, "నేను ఏడాదిపాటు మీ కింద పనిచేశాను. నా పని మీకు నచ్చినట్టయితే నా కోరిక చెల్లించండి," అన్నాడు.

"ఏం కోరతావు?" అని సుపర్ణుడడిగాడు.

"మీరు వెంటనే మీ సేనలను తీసుకుని ప్రవర్ధన మహారాజు పైకి యుద్ధానికి బయలుదేరండి. మనకు జయం తప్పదు," అన్నాడు ప్రగల్భుడు.

సుపర్ణుడు నిర్ఘాంతపోయి, "ఇదేం కోరిక? ఆయన నాకు చక్రవర్తి. నేనాయన కింద సామంతును!" అన్నాడు.

"నేనైనా పరాయివాణ్ణి కాదు. ఆ చక్రవర్తికి నేనే వారసుణ్ణి. ఈ యుద్ధంలో ఆయన ఓడిపోతే నేనే చక్రవర్తిని. ఆయన గెలిస్తే నాకే నష్టం! ఆడితప్పవద్దు," అన్నాడు ప్రగల్భుడు.

సుపర్ణుడు తన మాట నిలబెట్టుకోవటానికి సైన్యాన్ని అయుత్తం చేసి ప్రవర్ధనుడి పైకి యుద్ధానికి వెళ్ళాడు.

ప్రవర్ధనుడికి సైన్యాలను సమకూర్చు కునే వ్యవధి లేదు. అయినా ఆయన యుద్ధం చేసి వీరమరణం పాలు కావటానికి నిశ్చయించాడు గాని, తన మనమడికి సింహాసనం అప్పగించి అడవులపాలు కాదలచలేదు.

అప్పటికి చంపకవతికి నెలతప్పింది. ఆమెను మహారాజు తండ్రి ఇంటికి పంపుతూ, "ఈ యుద్ధం నుంచి నేను ప్రాణాలతో బయట పడకపోవచ్చు. నీకు గర్భం నిలిచిన మాట నిజమైన పక్షంలో నీకు కొడుకు పుట్టవచ్చు. ఏనాటికైనా వాడే నా సింహాసనానికి వారసుడు గనక, నా చిహ్నంగా వాడి మెడలో ఈ గొలుసు తగిలించు," అంటూ తన మెడలో ఉండే గొలుసు ఆమెకిచ్చాడు.

చంపకవతి పుట్టింటికి వెళ్ళిపోయింది.

యుద్ధంలో ప్రవర్ధనుడు మరణించాడు. ప్రగల్భుడు రాజ్యాభిషేకం చేసుకుని, రాజభవనంలో మునుపు ఉండినవారి నందరినీ వెళ్ళగొట్టి, తన నౌకర్లనే ఏర్పాటు చేసుకున్నాడు. అతను చేసిన రాజ్యపాలన చాలా క్రూరంగా ఉండటం చేత ప్రజలకు అతనంటే త్వరలోనే రోత పుట్టింది.

చంపకవతి కాలక్రమాన ఒక మగబిడ్డను కన్నది. ఆ బిడ్డ ప్రగల్భుడికి దగ్గరలో



ఉండటం మంచిది కాదని, చంపకవతి తండ్రి అయిన కాపు, ఆ పసిగుడ్డును తీసుకుని దూరదేశానికి వెళ్ళి, అక్కడ ఒకరి ఇంట పెంచటానికి ఏర్పాటు చేసి, తగినంత డబ్బు కూడా ఇచ్చాడు.

ప్రగల్భుడికి, నిజానికి, తన తాత మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడని గాని, ఆయన భార్య తన రాజ్యంలోనే ఉన్నదని గాని, తాను దుర్మార్గంగా ఆక్రమించిన సింహాసనానికి వారసు డొకడు పుట్టిపెరుగుతున్నాడని గాని కొంచెం కూడా తెలియదు.

పదహారు సంవత్సరాలు గడిచాయి. చంపకవతికి పుట్టిన కొడుకు ప్రద్యోతు డనే



పేరుతో పెరిగి పెద్దవాడై, కాపు ఇంటికి తిరిగి వచ్చాడు.

ప్రగల్భుడు సహజంగానే ప్రజాపీడకు డనీ, అతనంటే ప్రజలకు చాలా రోతగా ఉంటున్నదనీ, అతని పీడ ఎప్పుడు విరగడ అవుతుందా అని ప్రజలు ఎదురు చూస్తున్నా రనీ ప్రద్యోతుడికి రూఢిగా తెలిసింది. అలాటి వాణ్ణి ఉపాయంతో తొలగించవచ్చు ననుకున్నాడు ప్రద్యోతుడు.

కొంతకాలంగా ప్రగల్భుడు రోజు కొక ఇంటికి తన దూతలను పంపి, ఆ ఇంటి మనిషి నెవరినైనా రాత్రి తన యింటికి పిలి పిస్తున్నాడు. అలా వచ్చిన వాణ్ణి తెల్లవారిన దాకా కథలు చెప్పమంటాడు. ఆ కథలు తనకు నచ్చకపోతే తెల్లవారగానే తల తీయిస్తాడు. ఈ విధంగా చాలామంది తమ తలలను పోగొట్టుకున్నారు.

ప్రద్యోతుడు వచ్చిన కొద్ది రోజులకే కాపు ఇంటికి రాజదూతలు వచ్చి, "ఈ రాత్రికి మీ ఇంటి వారెవరైనా వచ్చి కథలు చెప్పా లని రాజుగారి ఆజ్ఞ," అని చెప్పారు.

కాపు కుంగిపోయి, "ఇవాళతో నా ఆయువు మూడింది. ఆ దుర్మార్గుడైన రాజుకు నచ్చే కథలు నేనెక్కడ చెప్ప గలను?" అన్నాడు.

"నీ కేం భయంలేదు, తాతా. ఆ రాజుకు కావలిసిన కథలు చెప్పటానికి నే నున్నాను గద!" అన్నాడు ప్రద్యోతుడు.

"నువు రాజు దగ్గిరికి వెళతావా? వద్దు, నా తండ్రీ!" అని చంపకవతి బావురు మని ఏడ్చింది.

"ముసలివాణ్ణి, ఇవాళ కాకపోతే రేపైనా నేను రాలిపొయ్యేవాణ్ణే. నన్నే పోనీ, బాబూ!" అన్నాడు కాపు.

"నే నంత సులభంగా చస్తాన నుకున్నారా? మీకేమీ భయంవద్దు," అని ప్రద్యోతుడు చీకటి పడగానే రాజభవ నానికి వెళ్ళాడు.

అతను వెళ్ళేసరికి రాజభవనంలోని వాళ్ళంతా భోజనాలు చేస్తున్నారు. ప్రద్యోతుడు వెళ్ళి ఆ పంక్తిలో కూర్చున్నాడు. వడ్డన చేసేవాడు ఆశ్చర్యపడి, "ఎవరు నువు?" అని అడిగాడు.

"ఈ రాత్రికి రాజుగారి అతిథిని. అలా చూస్తావేం? నే నీ రాత్రి రాజుగారికి కథలు చెబుతున్నాను. వడ్డించు," అన్నాడు ప్రద్యోతుడు.

పంక్తిలో వాళ్ళంతా ఆశ్చర్యంతో ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. రాజుగారికి కథలు చెప్పేవాళ్ళెవరూ విందులు కుడవటానికి వచ్చిన బంధువులల్లే రారు; ప్రాణాలరచేత బట్టుకుని వచ్చి, తెల్లారే సరికల్లా వాటిని పోగొట్టుకుంటారు.

వడ్డనవాడు మారుమాటాడక ప్రద్యోతుడికి వడ్డన చేశాడు. ప్రద్యోతుడు సుష్టుగా భోజనం చేసి, "ఇప్పుడు నన్నెవరన్నా రాజుగారి దగ్గిరికి తీసుకుపోండి," అన్నాడు.

నౌకర్లు ప్రద్యోతుణ్ణి రాజుగారి పడకగదికి తీసుకుపోయారు. ఆ సమయంలో ప్రగల్భుడు తన శయ్య మీద గోడ కేసి తిరిగి పడుకుని ఉన్నాడు.

"ఈ రాత్రి తమకు కథలు చెప్పటానికి వచ్చాను," అన్నాడు ప్రద్యోతుడు.



"చెప్పు," అన్నాడు ప్రగల్భుడు, వచ్చిన వాణ్ణి చూడకుండానే. ప్రద్యోతుడు తాను విన్న కథలన్నీ వరసగా చెప్పుకుపోయాడు. తెల్లవారింది. ప్రగల్భుడు మంచం మీద పొర్లి ప్రద్యోతుణ్ణి చూసి, "నువు కథలు బాగానే చెబుతావు," అన్నాడు.

"నువు వాటిని వింటేగద! తెల్లవార్లూ హాయిగా నిద్రపోయావు," అన్నాడు ప్రద్యోతుడు.

ప్రగల్భుడు ఆ మాటధోరణికి ఉలిక్కిపడి, "అటే పేలకు! నేను ఏనాడూ నిద్రపోయి ఎరగను. నా కసలు కన్ను మూతపడితేకద!" అన్నాడు.

"అదే నిజమైతే నువ్వేదో పాము కడుపున పుట్టి ఉంటావు!" అన్నాడు ప్రద్యోతుడు.

ప్రగల్భుడు ఆగ్రహావేశంతో కత్తి దూయబోయాడు.

"తొందరపడకు. కత్తి ఒకటి నా దగ్గిరా ఉన్నది. నువ్వెలా పుట్టావో మీ అమ్మ నడిగిరా!" అన్నాడు ప్రద్యోతుడు.

ప్రగల్భుడు చివాలున లేచి వెళ్ళిపోయి, కొంచెం సేపటికి తిరిగి వచ్చి, "నువ్వన్నది నిజం! నా తండ్రి మామూలు మనిషి కాడుట!" అన్నాడు.

"సరే, నీకు నిద్రపట్టే మార్గం నేను చెబుతాను విను. ఇక్కడికి కొంత దూరంలో గంధర్వుడి మడుగొకటి ఉన్నది. దానిలో స్నానం చేసి, ఈతలుకొట్టి రా. ఆ తరవాత నువు హాయిగా నిద్రపోగలుగుతావు," అన్నాడు ప్రద్యోతుడు.

ఆ పూటే ప్రగల్భుడు గంధర్వుడి మడుగులో స్నానం చెయ్యటానికి సపరివారంగా వెళ్ళాడు. అతడు నీటిలో మునగటం అందరూ చూశారు. ఆ తరవాత అతని జాడలేదు. చీకటిపడిన దాకా మడుగు ఒడ్డున పడిగాపులు కాసి, పరివారం తిరిగి వచ్చేసింది.

రాజుగారు మాయమయినట్టు ఊరంతా పాకిపోయింది. చాలామంది పండగ చేసుకున్నారు. అయిదారురోజులు గడిచాక మంత్రులు ప్రగల్భుడికి ఉత్తరక్రియలు జరిపేశారు. సింహాసనానికి వారసుణ్ణి నిర్ణయించటానికి పదమూడోనాడు సభ జరిగింది. ప్రద్యోతుడు ఆ సభకు వెళ్ళి, "నేను ప్రవర్తన మహారాజు కొడుకును. ఇదుగో నా మెడలో మా తండ్రిగారి హారం!" అని చెప్పి, హారం చూపించాడు.

అందరూ ఆ హారాన్ని గుర్తించారు. ప్రద్యోతుడికి రాజ్యాభిషేకం వైభవంగా జరిగింది. కాపు సకుటుంబంగా వచ్చి రాజభవనం చేరాడు. అంతా సుఖంగా ఉన్నారు.





# గృహపిశాచాలు

ఒకప్పుడు మహాకోసల దేశంలో దాదాపు ప్రతి ఇంటినీ ఒక్కొక్క పిశాచం ఆశ్రయించి ఉండేది. ప్రజలు మూఢులు కావటంచేత వాటిని గృహదేవతలని భావించి, గౌరవించి, పర్వదినాలలో పూజలు జరిపేవారు.

అపర్ణుడనే క్షత్రియుడి ఇంట ఒక పిశాచం ఉండేది. దానికి గుర్రాల పని చూడటమంటే సరదా. అదే గుర్రాలన్నిటికీ నీరు పెట్టేది, దాణా ఇచ్చేది. అయితే ఈ పిశాచికి అన్ని గుర్రాల కన్నా ఒక నల్ల గుర్రమంటే, ఇష్టం; అందుచేత ఆ గుర్రాని కది హెచ్చు గడ్డీ, ఎక్కువ దాణా పెట్టి, దాన్ని మరింత బాగా మాలీసు చేసేది.

అపర్ణు డొకనాడు తన కాసాకుర్రాణ్ణి పిలిచి, "ఒరే, నువు మన నల్ల గుర్రం విషయంలో చాలా పక్షపాతంగా ఉండి, మిగిలిన వాటిపట్ల అశ్రద్ధగా ఉంటున్నావు," అని మందలించాడు.

"నేను కాదు, బాబూ. గృహదేవతే అలా చేస్తున్నది," అన్నాడు కాసాకుర్రాడు.

అపర్ణుడు తృప్తిపడలేదు. ఒకనాడు అతను గుర్రాల తణిఖీకి వచ్చి, నల్లగుర్రం ముందు చాలా హెచ్చుగా పచ్చగడ్డి ఉండటం గమనించి, అందులో కొంత తీసి మిగిలిన గుర్రాల ముందు వెయ్యబోయాడు.

అంతలోనే ఆయన మెడ మీద పిశాచి బలంగా తన్నింది. ఆయన ఆ దెబ్బకు బోర్లా పడిపోయాడు.

అది మొదలు గుర్రాల పోషణ అంతా పిశాచే చూస్తూ వచ్చింది. అపర్ణుడు కూడా దానికి రోజూ బలులు పెట్టిస్తూ వచ్చాడు.

ఇంతలో విజయదశమి వచ్చింది. అపర్ణుడు ఆనాడు పెద్ద ఉత్సవం చేసి, తన కింది నౌకర్ల కందరికీ విందుభోజనాలు పెట్టి, కొత్తబట్ట లిస్తూ, పిశాచికి భోజనంతో బాటు పట్టుబట్టలు కూడా ఇచ్చాడు.

జి. వెంకటస్వామి




కొద్ది రోజులు గడిచింది. దీపావళి కొద్ది రోజు లున్నదనగా ఒకనాడు జోరున వర్షం ప్రారంభ మయింది. తన పరివారంతో సహా వేటకు వెళ్ళిన అపర్ణుడు వానలో చిక్కుకున్నాడు. వాళ్ళందరూ తిరిగి వచ్చే సరికి తడిసి ముద్ద అయారు.

అపర్ణుడు గుర్రాలను తన ఇంటి ముందే వదిలెయ్యమని, తాను బట్టలు మార్చు కున్నాడు. ఈ లోపల పిశాచి గుర్రాలను సాలలో కట్టేసి, తుడిచి, మేత వేస్తుందని అతను అనుకున్నాడు. కాని గుర్రా లింకా ఇంటి ముందే వానలో తడుస్తూ, చలికి సకిలించడం అతని చెవుల పడింది. కిటికీ కుండా చూస్తే పిశాచి పట్టుబట్టలు కట్టు కుని గుర్రపుసాల ద్వారం లోపలిగా నిల బడి, వానను చూసి ఆనందిస్తూ కనబడింది.

"గుర్రాలు ఇంటి ముందు వానలో తడుస్తున్నాయి. వాటి సంగతి చూడవేం?" అని అపర్ణుడు కేక పెట్టాడు.

"వాన వెలవనీ, వాటి సంగతి చూస్తాను. వానలోకి పోతే కొత్త పట్టుబట్టలు తడిసి పోవా?" అన్నది పిశాచి......

ఆ దేశంలోనే ఇద్దరు అన్నదమ్ము లుండే వాళ్ళు. వాళ్ళు తమ తండ్రి పొలాన్ని సమంగా పంచుకుని వ్యవసాయం చేసే వాళ్ళు. కాని ఏ కారణం చేతనో అన్నపొలం విరగ పండేది. ఇద్దరి పొలాలూ సమానమే అయినా, తమ్ముడి పొలంలో కన్న అన్న పొలంలో రెట్టింపు గింజలు రాలుతుండేవి.

కోతల తరుణం వచ్చింది. అన్న తన పొలానికి పోతూండగా అటుగానే పోతూ ఒక ముసలతడు కనిపించాడు. వాడు తన నెత్తిన ఒకే ఒక ధాన్యపుకంకి పెట్టుకుని నడుస్తూ, పెద్ద బరువు మోస్తున్నవాడి లాగా రొప్పుతున్నాడు.

"ఒరే, ముసలతా, ఆ కాస్త బరువుకే అంత హైరానపడుతున్నా వేమిట్రా?" అని అన్న నవ్వుతూ అడిగాడు.

"నేను నీకు మోసుకొచ్చేది నువే నాకు మోసుకొస్తే ఆ బరువు నీకే తెలిసేది," అంటూ బుడతడు గిరుక్కున వెనక్కు తిరిగి, తమ్ముడి పొలం కేసి వెళ్ళిపోయాడు.

అది మొదలు అన్న పొలంలో పంట చాలా పడిపోయింది, తమ్ముడి పొలం మామూలుకు రెట్టింపు పండసాగింది.

ఆ బుడతడు ఒక పిశాచి. చాలా ఏళ్ళుగా అన్న పొలంలో పంట సమృద్ధిగా ఉండేటట్టు తోడ్పడుతూ వచ్చాడు......

వీటికన్న కూడా ఒక విచిత్రమైన సంఘటన మరొకటి ఉన్నది. రెండు పక్క పక్క పొలాలలో రెండు పిశాచాలు పని చేస్తూ ఉండేవి. ఒక పొలంలో గింజలు బాగా రాలేవి. రెండో పొలంలో గడ్డి పుష్కలంగా అయేది. దీని రహస్యం ఒక రోజు బయటపడింది. ఒక పిశాచి రెండో పొలం నుంచి ధాన్యం కాజేసేది, రెండోది మొదటి పొలం నుంచి గడ్డి కాజేసేది. ఇలా దొంగతనం చేస్తూ ఒకసారి రెండు పిశాచాలూ ఒకదాని కొకటి దొరికిపోయాయి.

"మా పొలంలో ధాన్యం కాజేస్తావురా?" అన్నది ఒక పిశాచి.

"మా పొలంలో గడ్డి కాజేస్తున్నది నువా?" అన్నది రెండోది.

రెండు పిశాచాలూ హోరాహోరి పోట్లాడుకుంటూ రెండు పొలాలనూ తొక్కి నాశనం చేశాయి.

ఇలాంటి సంఘటనలు ఎన్నో ఉన్నాయి. ఈ పిశాచాల మూలంగా లాభం పొందిన వారూ ఉన్నారు, నష్టపోయిన వారూ ఉన్నారు. కాని గౌతమబుద్ధుడు మహా కోసలలో అడుగుపెట్టిన నాడే ఆ దేశంనుంచి ఈ పిశాచాలన్నీ పారిపోయాయి. అటు తరవాత కూడా ప్రజలు కొంత కాలంపాటు తమ "గృహదేవతలను" పూజించారు గాని వారి కందువల్ల కొంచెం కూడా లాభం కలగలేదు.






# ఆవుదొంగతనం

ఒకసారి పాపన్న ఒక దూర గ్రామానికి బయలుదేరాడు. ఆ గ్రామానికి కరణంగా ఉండే శేషయ్యగారింట మర్నాడు ఏదో అక్కర. దానికి రావలిసిందిగా కరణం శేషయ్య, రెండురోజుల క్రితమే పాపన్నకు కబురు చేశాడు. అందుచేత కాస్త పొద్దు వాలగానే పాపన్న తన ఇంటి నుంచి బయలుదేరాడు.

కరణం శేషయ్యగారి ఊరు ఇంకా కొంత దూరం ఉన్నదనగా పాపన్నకు ఒక దృశ్యం కనబడింది.

ఒక నల్లఆవు దూకుతూ పరిగెత్తుకుని పాపన్న కేసి వస్తున్నది. దాని పలుపు పట్టుకుని ఒక మనిషి వస్తున్నాడు. ఆవును ఆపటానికి వాడు చేసే ప్రయత్నం ఏమీ పనికిరావటం లేదు. ఆవు వాణ్ణి ఈడ్చుకుంటూ వస్తున్నది. ముళ్ళూ, రాళ్ళూ తగిలి వాడు బాగా గాయపడినట్టు కనిపిస్తున్నాడు. అయినా వాడు మొండికెత్తి పలుపుతాడు మాత్రం వదలలేదు.

వాడు పాపన్నను చూసి, "బాబూ, ఆవును కాస్త మళ్ళెయ్యండి," అన్నాడు.

పాపన్న ఆవు కెదురు వెళ్ళి, చేతులెత్తి ఆడిస్తూ, "హే! హే!" అన్నాడు. అంత ఉద్రేకంలోనూ ఉన్న ఆవు పాపన్న గొంతు విని నిలిచిపోయింది. అది అకస్మాత్తుగా ఆగటంలో దాని మెడ తాడు పట్టుకున్న మనిషి నేల పైన పడిపోయాడు.

పాపన్న ఆ తాడును తీసుకుని సమీపంలో ఉండే చెట్టుకు చుట్టి, ఆ మనిషిని లేపి కూర్చోబెట్టి, "బాగా దెబ్బలు తగిలాయే! ఏం చేశావు? ఆవు ఎందుకిలా పరిగెత్తింది?" అని అడిగాడు.

"ఎందుకు పరిగెత్తిందంటే ఏం చెప్పను? కొవ్వెక్కి పరిగెత్తింది. మొన్ననే బోలెడంత డబ్బు పోసి కొన్నాను. కొన్నప్పటి నుంచీ

మొండితనం చేస్తూ మొరాయిస్తూనే ఉంది. ఇవాళే కాస్త మేపుదామని ఇలా బయటికి తెచ్చాను. దయ్యం పట్టినట్టు పరుగు లంకించుకుంది," అన్నాడు ఆ మనిషి.

ఆ మనిషి లేచి, "నా కర్ర కూడా ఎక్కడో పడి పోయింది. ఇవాళ దీని ప్రాణాలు తీసి తీర్తాను. ఇంత పొగరా?" అంటూ చెట్టు కొమ్మ విరిచి ఆవును కొట్ట బోయాడు. ఆవు కళ్ళు పెద్దవిచేసి, బుస కొట్టుతూ ఆ మనిషిని కొమ్ములతో కుమ్మ బోయింది.

పాపన్న దాని ముఖం నిమిరాడు. ఆవు ఉద్రేకం దిగిపోయింది.

"ఆ కర్ర అవతల పారెయ్యి. ఇటువంటి పనులు చేసే దానికి ఆగ్రహం తెప్పించి ఉంటావు. అది పోట్లగొడ్డయితే నన్ను పొడవదేం? పశువుల్ని ఎంత ప్రేమగా చూసుకోవాలి!" అన్నాడు పాపన్న.

"అదంతా నాకు తెలుసు. కాని ఇప్పుడేం చేసేట్టు? నన్ను నేల మీద ఈడ్చి హూనం చేసేసింది. ఆ కొండమలుపు అవతల ఉంది మా గ్రామం. నేనే నడవలేనే, ఇది మంచిగా నా వెంట వచ్చేటట్టు చెయ్యగలనా? ఎవరు సహాయం వస్తారబ్బా?" అంటూ ఆ మనిషి దిక్కులు చూశాడు.




"సహాయం కావాలంటే నేను వస్తాను పద," అంటూ ఆవుతాడు చేతబట్టుకుని ఆ మనిషి వెంట, అతడి గ్రామానికి బయలుదేరాడు పాపన్న.

దారిలో ఆ మనిషి, "మీ రెవరు? మీ దేవూరు?" అని అడిగాడు.

పాపన్న తన ఊరూ, పేరూ చెప్పి, "రేపు కరణం శేషయ్యగా రింట అక్కర. దాని కోసం బయలుదేరి వస్తున్నా," అన్నాడు. పాపన్న ఆ మనిషి ఇంటి దాకా పోయి, దొడ్లో ఆవును కట్టేసి, దానికి మేతా, నీరూ పెట్టించి, చీకటిపడే వేళకు కరణం శేషయ్యగా రిల్లు చేరాడు.




కరణం శేషయ్య పాపన్నను కుశల ప్రశ్నలు వేశాక, "చూడు, పాపన్నా, నేను రెండేళ్ళ క్రితం నీ దగ్గిర కొన్న ఆవుకు ఇవాళ అకస్మాత్తుగా ఏదో రోగం పుట్టు కొచ్చిందని మా కమతగా డన్నాడు. పొద్దున కూడా నిక్షేపం లాగుంది. ఈ పూట ఏం ముంచుకొచ్చిందో, నడవలేకుండా ఉన్న దట. నలుగురు మనుషులను పంపించాను. ఆవును మోసుకు రమ్మని," అన్నాడు.

ఈ మాట విని పాపన్న చాలా బాధ పడ్డాడు. ఇంతలోనే మనుషులు ఆవును తెచ్చి ఇంటి ముందు ఆవరణలో ఒక పక్కగా పడుకోబెట్టారు. పశువుల వైద్యుడి కోసం మనిషి వెళ్ళాడు. పశువుల వైద్యుడు వచ్చి, ఆవును చూసి, "ఇది రెండు మూడు రోజుల క్రితం ఈనినట్టు కనబడు తుంది. పెద్ద రోగమేమీ లేదు. వైద్యం చేస్తే నయమవుతుంది," అన్నాడు.

కరణం శేషయ్య ఆశ్చర్యపడి, "రెండు మూడు రోజుల క్రితం ఈనట మేమిటి? మా ఆవుకు రెండునెల్ల దూడ ఉంటేనూ!" అంటూ దగ్గిరికి వచ్చి ఆవును పరీక్షగా చూసి, ఆశ్చర్యపడుతూ, "ఇది మా ఆవు కాదు," అన్నాడు.

ఆ మాట నిజమే. దూడ కూడా దాని దగ్గిరికి పోలేదు.

అయితే కరణం శేషయ్యగారి నల్లావు ఏమయినట్టు?

పాపన్నకు వెంటనే సందేహం కలిగింది. తాను అడ్డగించి, ఆపి, ఆ మనిషి ఇంట కట్టివచ్చిన నల్లావు కరణం శేషయ్యగారిదై వుంటుందా? ఆ ఆవును రెండురోజుల క్రితమే కొన్నట్టు ఆ మనిషి చెప్పాడే!

ఎవరిని గురించీ తొందరపడి చెడ్డగా ఆలోచించే స్వభావం పాపన్నకు లేదు. మరొకసారి ఆ మనిషి ఇంటికి వెళ్ళి, సరిగా ఆరా తీసి, నిజం తెలుసుకున్న దాకా అతను కరణం శేషయ్యతో ఏమీ అనదలచలేదు.

శేషయ్య మటుకు కమతగాణ్ణి పిలిచి, "ఇది మన ఆవు కాదురా! మన ఆవు మారి పోయింది. రేపు విచారించు. దాన్ని ఇంకెవరి ఇంటికి తోలావో పొరపాటున," అన్నాడు.

కమతగాడి ప్రయత్నం ఏమీ అవసరం లేకుండానే, జాము పొద్దెక్కే సరికల్లా శేషయ్యగారి ఆవు దానంతట అదే పరిగెత్తు కుంటూ వచ్చి, తన దూడ దగ్గిర నిలబడి, దానికి పాలిచ్చింది. పాపన్నతో సహా అందరూ పరమానందం చెందారు.

"సంగతి తేలిపోయింది. ఎవడో దుర్మా ర్గుడు జబ్బుపడిన తన నల్లావును మన మందలోకి చల్లగా తోలి, మన ఆవును తోలుకుపోయి వుంటాడు. ఈ రోగిష్ఠి ఆవుకు చికిత్స కూడా దేనికి? చావనీ!" అన్నాడు కరణం శేషయ్యగారు కసిగా.

"దొంగను శిక్షించాలి గాని, ఆవు నెందుకు చావనివ్వటం? చికిత్స చేయిం చండి. దొంగ దొరక్కపోతే మనకు మరొక ఆవు దక్కుతుంది గదా!" అన్నాడు పాపన్న. కరణంగారు ఆ మాటతో కాస్త శాంతించాడు.

పాపన్న ఇప్పుడే వస్తానని చెప్పి కొండ మలుపులో ఉన్న గ్రామానికి వెళ్ళి, ఆవు దొంగను చూశాడు. ఆ మనిషి మరి కొన్ని



కొత్తగాయాలతో మంచాన పడి ఉన్నాడు. ఆ ఉదయమే కరణంగారి ఆవు కట్టుతాడు తెంచుకుని, అడ్డం వచ్చిన దొంగను డొక్కలో కుమ్మి మరీ వెళ్ళిపోయింది.

"అది ఆవు కాదండీ, నా పాలిటి మృత్యు దేవత!" అన్నాడు దొంగ, పళ్ళుకొరికి పెద్దగా మూలుగుతూ.

"మృత్యువును కోరి తెచ్చుకున్నావు? కరణం శేషయ్యగారి దగ్గిరేనా దాన్ని కొన్నావు?" అని పాపన్న అడిగాడు.

"అయ్యబాబో, అది కరణం శేషయ్యగారి ఆవా?" అన్నాడు దొంగ, తన దొంగ తనం బయట పెట్టుకుంటూ. కరణంగారు

చాలా నిక్కచ్చి మనిషి. తన ఆవును ఎవరైనా దొంగతనం చేసినట్టు తెలిస్తే బతక నివ్వడు. ఆ సంగతి దొంగకు తెలుసు.

అతను పాపన్నను బతిమాలుతూ, "బాబూ, నే నా ఆవును దొంగిలించినట్టు కరణంగారికి తెలియనివ్వకండి. చేసిన పనికి శిక్ష బాగానే అయింది," అంటూ తాను చేసిన పని పాపన్నకు చెప్పేశాడు.

దొంగకున్న నల్ల ఆవు ఈనింది. అది ఆహరమూ, నీరూ ముట్టక పడుకుని ఉండటం చూసి, అది బతకదని భయ పడ్డాడు. పాలులేక దూడ కాస్తా చచ్చింది. కొండ ప్రాంతానికి పశువులమందలు మేత కోసం వస్తాయి. దొంగ తెల్లారకముందే లేచి, బలవంతాన తన ఆవును నడిపించు కుంటూ మేతస్థలానికి తీసుకుపోయి, పొదల చాటున పడుకోబెట్టాడు. జాము పొద్దెక్కే సరికి ఆవుల మందలు మేతకు వచ్చాయి. కమతగాళ్ళు ఎండవేళ ఏ చెట్టు నీడనో కునుకుతున్న సమయంలో, దొంగ తన ఆవులాంటి దాన్నే ఒకదాన్ని ఏరుకుని, దాన్ని దువ్వి మాలిమి చేసుకుంటూ, మెడకు తాడు తగిలించి, తీసుకుపోసాగాడు.

తన ఇంటి కేసి పోవటం లేదని తెలియ గానే ఆవు మొరాయించి తన ఇంటి దారిపట్టి పరిగెత్త సాగింది. ఆ సమయంలోనే పాపన్న ఎదురు వచ్చి, దొంగకు సహాయపడి, ఆవును దొంగ ఇంటికి చేర్చాడు.

పాపన్న దొంగకు మరొక రూపంలో కూడా సహాయం చెయ్య నిశ్చయించాడు. అతను కరణం శేషయ్య ఇంటికి వెళ్ళి, జరిగినదంతా చెప్పి, దొంగ చాలా శిక్ష అనుభవించాడనీ, అతన్ని మరి శిక్షించ వద్దనీ అన్నాడు. పాపన్న మాట తీసెయ్య లేక కరణంగారు సరేనన్నాడు.

త్వరలోనే దొంగ ఆవుకు రోగం నయ మయింది. దొంగ వచ్చి దాన్ని తన ఇంటికి తోలుకుపోయాడు.





# కృష్ణావతారం

గోకుల మంతా ఒక్క సారి కదిలింది. అందరూ ప్రయాణసన్నాహంలో మునిగి పోయారు. బరువులు బళ్ళకెత్తారు. నేతులూ, పాలూ గల కుండలను భద్ర పరిచారు. సంచులలో ధాన్యమూ, బియ్యమూ మొదలైనవి పోసి కట్టారు. రకరకాల తాళ్ళూ, పలుపులూ, కవ్వాలూ, కొడవళ్ళూ, కత్తులూ, గంటలూ, పశువుల నోళ్ళు తెరవటానికి ఉపయోగించే సాధనాలూ మొదలైన పనిముట్లన్నీ జాగ్రత్త పరిచారు. కోలాహలంగా ప్రయాణసన్నాహం పూర్తి అయింది.

బలరాములు పశువులను తోలుకుంటూ ముందు బయలుదేరారు. మందల వెనకగా బళ్ళు నడిచాయి. వాటి వెనక మనుషులు కదిలారు. వయసులో ఉన్న ఆడవాళ్ళంతా ఒక జట్టుగా నడుస్తూ, పరాచకాలాడుకుంటూ, వినోదం పొందారు. కుంటి, గుడ్డి, ముసలివాళ్ళు నడవలేకుండా ఉంటే వాళ్ళకు యువకులు సహాయపడ్డారు.

ఈ విధంగా గోకులం బృందావనానికి వచ్చి చేరింది. గోపాలకులలో పెద్దలైన వాళ్ళు ఇళ్ళు కట్టుకోవటానికి స్థలాలు నిర్ధారణ చేశారు. బళ్ళన్నీ ఒక వరసలో అర్థచంద్రాకారంలో దిగాయి. కొందరు గుడిసెలు నిర్మించారు. కొందరు లతా గృహాలనే తాత్కాలికంగా ఇళ్ళుగా వాడుకున్నారు. కొందరు చెట్ల కింద కాపరాలు పెట్టేశారు. కొందరు కంప పేర్చి దొడ్లు నిర్మించారు. ఒక్క రోజు గడిచే సరికల్లా



బృందావనం గోపకులకు స్వస్థలమయి పోయింది. రోజులు గడిచేకొద్దీ, చక్కగా అలంకరించుకు తిరిగే గోపికలతోనూ, ఆడా వుడిగా తిరిగే గోపాలకులతోనూ, సందడి చేసే గోవులమందలతోనూ ఆ ప్రదేశానికి ఎక్కడలేని కళా వచ్చింది.

నానాటికీ గోపకులంవాళ్ళ సంపద పెంపొందుతున్నది. మందలు పెద్దవవు తున్నాయి. జీవితం హాయిగా నడుస్తున్నది. కృష్ణుడు పదమూడేళ్ళ వాడయాడు.

వేసవి వచ్చింది. నిక్షేపంగా ఉన్న పశు వులకు రకరకాల తెగుళ్ళు పుట్టుకొచ్చాయి. అవి వణుకుతూ, నిలబడలేకపోయాయి. నోట నురుగులు కక్కాయి. వాటి మెడలు వాలబడిపోయాయి. గిట్టలు పగిలి పురుగులు బయటికొచ్చాయి.

ఈ తెగుళ్ళకు గోపాలకులు మంత్రాలూ, మందులూ, మాకులూ, అన్నీ ప్రయోగించి చూశారు. కాని ప్రయోజనం లేకపోయింది. ఇక ఏం చెయ్యాలో వారికి తోచలేదు. ఈ తెగుళ్ళు యమునానదీ ప్రాంతపు అరణ్యాలలోని సమస్త మృగ పక్షి కీటకజాతులకూ వచ్చాయి, వాటి నుంచి గోపకులకు కూడా రోగాలు తగిలాయి. అందరూ భయంకరమైన వ్యాధిలక్షణాలతో బాధ పడసాగారు.

నందుడూ, యశోదా, రోహిణీ కూడా రోగగ్రస్తులయారు. ఆ స్థలం వదిలిపెట్టి పోతేగాని బతకలేమని కృష్ణుడికి తోచింది. అతను బలరాముడితో మాట్లాడి, కొన్ని మందలను తోలుకుని ఒక కోసుదూరం వెళ్ళి అక్కడ ఆగాడు. అతనిలాగే మరి కొందరు గోపకులు కూడా అలాగే చేశారు. అలా వెళ్ళిపోయిన గోవులకూ, మనుషులకూ వ్యాధి సోకలేదు.

నందుడు మాత్రం కదలననేశాడు. "ఇది మన చోటు. ఇక్కడ ఏమి వచ్చినా భరించవలిసిందేగాని, చుట్టాలందరినీ వేసు



కుని ఎక్కడికని వెళ్ళేది?" అన్నాడతను. నంద యశోదా రోహిణులు రోగంతో తీసుకుంటూ ఇలా మూర్ఛించేసరికి ఏం చెయ్యాలో కృష్ణుడికి తెలియలేదు.

ఈ గోకులంలో విదేహదేశం నుంచి వచ్చిన ఒక ముసలిగోపకు డొక డున్నాడు. అతను గోపప్రముఖులతో, "చూడండి, నాయనలారా! మనం పశువుల నాశ్రయించి బతుకుతున్నవాళ్ళం. పశుపతి శివుడు. శివార్చన చేస్తేనేగాని మనకీ కష్టాలు తీరవు. ఇలా దిగాలుపడి చూస్తూ కూర్చుంటే ఏమీ లాభంలేదు. తెలిసిన బ్రాహ్మణులను పిలిపించి శివార్చన జరిపించండి," అన్నాడు.

పెద్దవాడు చెప్పిన మాటపైన గురి ఉంచి గోపకులు సమర్థులైన బ్రాహ్మణులను పిలిపించి శివపూజకు అవసరమైన ఏర్పాట్లన్నీ చేశారు. ఈశ్వరుడికి వారం రోజులపాటు పగలూ, రాత్రీ అభిషేకమూ, అర్చనా, నైవేద్యమూ జరిగాయి. ఏడు రోజులూ నిర్విఘ్నంగా శివార్చన జరగగా, ఏడోనాటి మధ్యాన్నం ఒక సద్బ్రాహ్మణుడికి పూనకం వచ్చింది. ఆ పూనకంలో ఆ బ్రాహ్మణుడు వెర్రిగా నవ్వుతూ, భయంకరంగా నాట్యం చేస్తూ ఇలా అన్నాడు:



"నన్ను పరమశివుడు కైలాసం నుంచి పంపాడు. 'ఒరే, శంఖకర్ణా, కాళిందీతీరాన రోగాలతో తీసుకుంటున్న ప్రాణులకు మేలు చెయ్యి, వెళ్ళు!' అని నాతో అన్నాడు. మీరు చేసిన అర్చనకు శివుడు సంతోషించాడు. మీ కందరికీ ఈ రోగాలు రావటానికి కారణం తెలుసా? ద్వాపరయుగాంతంలో రాక్షసులందరూ భూలోకాన్ని పీడించటానికి రకరకాల జన్మలెత్తేటప్పుడు, కాలకలి అనే రాక్షసుడు, విరోచనుడి కొడుకు, ఒక విషపు వెలగచెట్టుగా యమునానదికి దక్షిణతీరాన మొలిచాడు. ఆ చెట్టు చుట్టూ ఆ రాక్షసుడి బంట్లందరూ విషవృక్షాలు





69




గానూ, ముళ్ళచెట్లుగానూ పుట్టారు. ఆ విషపు వెలగచెట్టు గాలిసోకి మీకూ, మీ పశువులకూ ఈ రోగాలు వచ్చాయి. దాని మూలంగా నీరు కూడా చెడిపోయింది. ఆ విషవృక్షాన్ని నిర్మూలించే శక్తి నంద గోపుడి కొడుక్కూ, బలరాముడికీ ఉన్నది. వాళ్ళందుకు ఒప్పుకునే పక్షంలో మీరంతా బతికిపోతారు. ఈ మాట మీకు చెప్పమని పరమశివుడు నన్ను పంపాడు. ఇక నేను పోతాను, శలవిప్పించండి."

ఈ మాటలంటూండగానే బ్రాహ్మణుడికి పూనకం దిగిపోయింది. బ్రాహ్మణులు సంతోషించి, శివార్చన పరిసమాప్తి చేసేశారు. వెంటనే గోపకులు బలరామకృష్ణులను పిలిపించి, వారికి సంగతంతా చెప్పారు. అంతా విని వాళ్ళు, "ఈశ్వరాజ్ఞ అయింది. తల్లిదండ్రులనూ, కులం వాళ్ళనూ బతికించుకునే అవకాశం కన్న కావలిసినదేమున్నది? ఆ విషపు వెలగ చెట్టును తప్పక నిర్మూలిస్తాం," అన్నారు.

కృష్ణుడు బ్రాహ్మణులకు నమస్కారం చేసి, శంకరుడి ముందు సాష్టాంగపడి, శివాలయం చుట్టూ ప్రదక్షిణ చేసి బలరాముడి కేసి చూశాడు. బలరాముడు కూడా అలాగే చేశాడు. తరవాత వాళ్ళిద్దరూ కత్తులూ, గొడ్డళ్ళూ తీసుకుని విషవృక్షం ఉండే ప్రాంతానికి బయలుదేరారు.

శివార్చనతోనే చాలామంది గోపకులకు ఆరోగ్యం కలిగింది. వాళ్ళందరూ కూడా సింహనాదాలు చేస్తూ, బలరామకృష్ణుల వెంట బయలుదేరారు.

విషవృక్షం ఎక్కడ ఉన్నదా అని వెతికే అవసరం కూడా లేకపోయింది. వాళ్ళు కీకారణ్యం కేసి నడిచే కొద్దీ చెట్టు నుంచి వచ్చే దుర్గంధం దుర్భరం అయింది. త్వరలోనే ఆ విషవృక్షం వారికి భయంకరాకారంలో ఎదురుగా కానవచ్చింది. అది ఆకాశమంత ఎత్తుండి ఒక పెద్ద భూతంలా



గున్నది. దాని చుట్టూ చాలా దూరందాకా దారుణమైన ముళ్ళచెట్లు వ్యాపించి ఉన్నాయి. బలరామకృష్ణులు కత్తులతో ఆ ముళ్ళపొదలను నరికి దారి చేసుకుంటూ విషవృక్షాన్ని సమీపించారు.

ఆ విషపు వెలగచెట్టు మొదలు ముప్ఫై బారలున్నది. దాని కాయలు ఏనుగు తలలంతేసి ఉన్నాయి. దాని కొమ్మలు అన్ని వైపులకూ అంతులేకుండా వ్యాపించి ఉన్నాయి. దుర్గంధమంతా ఆ చెట్టు కాయల నుంచే వస్తున్నది. అందుచేత ముందుగా వాటిని నిర్మూలించాలనుకున్నాడు కృష్ణుడు.

బలరామకృష్ణులిద్దరూ కలిసి చేతికందిన పిందెలనూ, కాయలనూ, దోరకాయలనూ, పళ్లనూ తెంచిపారెయ్య నారంభించారు. అందని వాటిని రాళ్ళతోనూ, కర్రలతోనూ కొట్టి రాల్చారు. అందీ అందని కొమ్మలను పట్టి వంచి ఫెళఫెళా విరిచేశారు. గోపాలకులందరూ పెద్ద పెట్టున కేకలు పెడుతూ ఈ పనిలో సహాయపడ్డారు. కొంతసేపటికి చెట్టు మీద ఒక్క పిందె కూడా మిగలలేదు.

బలరామకృష్ణులు ఈ విధంగా విషవృక్షాన్ని ధ్వంసం చేస్తూ ఉంటే ఆ ప్రాంతంలో తిరిగే కొన్ని అవులూ,



దూడలూ గోపకుల పైకి దౌర్జన్యంగా వచ్చాయి. అవి మామూలు ఆవులూ, దూడలూ కావు. అక్కడ చెట్లుగానూ, పొదలుగానూ జన్మించిన రాక్షసుల భార్యలూ, వాళ్ళ పిల్లలూ పశువుల రూపంలో అక్కడ సంచరిస్తున్నారు.

కృష్ణుడు ఈ పశువులను నిర్మూలించసాగాడు. రాక్షసులు తమ అసలు రూపాలతో, నెత్తురు కక్కుతూ, చచ్చిపోనారంభించారు. గోమాతలుగా ఉన్న రాక్షసస్త్రీలు మండిపడి, కృష్ణుణ్ణి తమ కొమ్ములతో పొడిచి చంపబోయారు. కృష్ణుడు అవలీలగా వాటిని పారదోలాడు. ఆ తరవాత



అతను విషవృక్షాన్ని పూర్తిగా ధ్వంసం చేసేశాడు.

గోపకుమారు లందరూ కలిసి ఆ చెట్టు తుండాలనూ, చుట్టూ ఉండిన ముళ్ళ పొదలనూ, చచ్చిన రాక్షసకళేబరాలనూ ఒక గుట్టగా వేసి, ఆ గుట్టకు నిప్పు అంటిం చారు. చూస్తుండగానే మంటలు ఆకాశ మెత్తు లేచాయి. అగ్నిహోత్రుడా చెట్లనూ, పొదలనూ, రాక్షసకళేబరాలనూ అతి ప్రీతిగా దహనంచేసి ఇంత బూడిద మిగిల్చాడు.

గోపాలకు లందరి శరీరాలూ చెమటతో తడిసి, నుసి అంటుకున్నాయి. వాళ్ళు



చాలా శ్రమపడి అలిసిపోయి ఉన్నారు. అందుచేత అందరూ ఇసుక మీదుగా యమునా నదికి వెళ్ళారు. అక్కడ వాళ్ళు చాలాసేపు ఈతలు కొట్టారు, ఓలలాడారు, నీటిమీద చేతులతో దరువులువేస్తూ పాటలు పాడారు. ఆ విధంగా పొద్దువాలే దాకా జల క్రీడలాడి సాయంకాలం వేళకు నీటి నుంచి బయటికి వచ్చి, తల్లులు తెచ్చిన భోజనాలు తిని, తాంబూలాలు వేసుకుని, కాస్సేపు విశ్రాంతి తీసుకుని మళ్ళీ ఇళ్ళకు ఆడుతూ, పాడుతూ తిరిగి వచ్చారు.

రోజులు గడుస్తున్నాయి. మనుషులకూ, పశువులకూ వచ్చిన తెగుళ్ళు నివారణ అయాయి. ఇంతలో వేసవి కూడా గడిచి పోయింది. వర్షాకాలం ఆరంభం కాబో తున్నట్టు గుర్తుగా ఆకాశాన నల్లని మేఘాలు కమ్మసాగాయి. మేఘగర్జన వినిపించి అందరికీ ఉత్సాహం పుట్టుకొచ్చింది. త్వర లోనే వడగళ్ళతో సహా వాన ఆరంభ మయింది. ధారాపాతంగా వర్షం పడింది. భూమి పచ్చగా అయింది. సెలయేళ్ళూ, నదులూ నిండుగా పారాయి.

ఇలాంటి ఆనంద సమయంలో, విదేహ దేశంలో ప్రజలందరినీ భయోత్పాతంలో ముంచెత్తే కొన్ని విపరీత సంఘటనలు



జరగసాగినై. ఆ ప్రాంతాల నివసించేవారిలో కుంభకు డనేవాడు గొప్ప గోధనాలు కల వాడు. అతడు దాతృత్వానికీ, ధర్మగుణా నికీ పేరు పొందినవాడు. అర్థులకు లేదన కుండా, అతడూ, అతడి భార్య అయిన ధర్మద దానాలు చేస్తూండేవారు. అతడు యశోదకు తమ్ముడు. శ్రీ ధాముడనే పుత్రుడూ, నీళ అనే కన్యా అతని సంతానం.

పూర్వం తారకాసురుడితో విష్ణువు యుద్ధం చేసినప్పుడు, ఆ యుద్ధంలో కాల నేమి పుత్రులేడుగురిని అతడు వధించాడు. ఆ ఏడుగురూ పగతీర్చుకునేందుకు కుంభకు డుండే గోవ్రజంలో ఏడు అబోతులుగా పుట్టారు. వాళ్ళ ఘోరకృత్యాలు అన్నీ యిన్నీ కావు. మందలలోపడి దొరికిన అవు లనూ, ఎద్దులనూ చంపటం, ఎదిరించ వచ్చిన గోపాలకులను పొడిచి కాళ్ళతో మట్టగించటం, గోడలను కొమ్ములతో కుమ్మి పడకొట్టి కొట్టాలలో వున్న పశువు లను కూడా హతమార్చటం, వాళ్ల నిత్య కృత్యమైపోయింది.

కుంభకుడు అబోతులను పట్టుకొనటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఎందరెందరో యోధులూ, మల్లులూ వెళ్ళి, వాటిని హత మార్చబోయి తామే హతులయ్యారు. కొన్నాళ్ళకు యీ అబోతులు కుంభక వ్రజంలో యిక తాము నాశనం చేసేందు కేమీ మిగలక, విదేహరాజ్యంలోని గ్రామాల మీదికి వెళ్ళి పశువులనూ, మనుషులనూ చంపసాగినై. ఈ ఘోరాలు భరించలేక ప్రజలందరూ మిథిలానగరరాజు వద్దకు వెళ్ళి, అయనతో, "మహారాజా! కుంభకుడి గోవులమందలో పుట్టిన ఏడు అబోతులు, మా మందలనూ, పచ్చని పైరుపొలాలనూ సర్వనాశనం చేస్తున్నవి. వాటిని చంపి మీరు మమ్మల్ని కాపాడకపోతే, మేమంతా మరో రాజ్యం వలసపోక తప్పదు," అని విన్నవించుకున్నారు.





# అరణ్యపురాణం

## 8

"అన్న" వొంటి మీద రోమాలు నిక్కబొడుచుకుని ఉన్నాయి.

"నిన్ను మభ్యపెట్టటానికి షేర్‌ఖాన్ నెల రోజులపాటు ఎటో వెళ్ళాడు. వాడు తబకీని వెంటబెట్టుకుని నిన్ననే కొండలు దాటి నీ కోసం వెతుక్కుంటూ వచ్చాడు," అన్నాడు అన్న వగర్చుతూ.

మౌగ్లీ ముఖం చిట్లించి, "షేర్‌ఖాన్‌ను నేను ఖాతరు చెయ్యను. కాని తబకీ జిత్తుల మారివాడు," అన్నాడు.

అన్న పెదవులు నాక్కుంటూ, "భయపడకు. తెల్లవారుజామున తబకీని కలిశాను. ఆ నక్కగాడు నాతో అంతా చెప్పేశాడు. అంతా విన్నాక వాడి నడుము విరగ్గొట్టేశానులే. ఇవాళ సాయంకాలం నువు గ్రామానికి తిరిగి వెళ్ళేటప్పుడు గ్రామద్వారం వద్ద కాపు వెయ్యాలని షేర్‌ఖాన్ ఆలోచనట. వాడిప్పుడు వాయిన్‌గంగ పెద్ద కనుమలో ఉన్నాడు," అన్నాడు.

"వాడివాళ తిండి తిన్నాడా, లేక పరగడుపున వేటాడుతున్నాడా?" అని అడిగాడు మౌగ్లీ.

ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న. దాని సమాధానం పైన మౌగ్లీ చావు బతుకులాధారపడి ఉన్నాయి.

"తెల్లారుజామునే ఒక పందిని చంపాడు. పూటుగా తిన్నాడు, తాగాడు. షేర్‌ఖాన్ గాడి సంగతి నీకు తెలీదా? పగబట్టి నప్పుడైనా ఒక పూట పస్తుండలేడు, వెధవ," అన్నాడు అన్న.

"వెధవ, చవట వెధవ! కూన కన్న కూడా అన్యాయం! తిని తాగాడూ? తాను నిద్రపోయి లేచేదాకా నేను కనిపెట్టుకుని ఉంటాననా వాడి ఉద్దేశం? ఇప్పు డెక్కడ

అట్ట చివరి బొమ్మ



పడుకుని ఉన్నాడు? మనం పదిమందిమి ఉంటే వాడి అంతు తేల్చేపని! వాడి వాసన తగిలితే తప్ప ఈ దున్నలు వాడి మీదికి పోవు. నాకేమో వాటి భాష తెలిసి చావదు. వీటికి వాడి వాసన తగిలేటట్టు తోలుకు పోగలమా?" అన్నాడు మౌగ్లీ.

"వాసన తెలియరాకుండా వాయిన్‌గంగ ప్రవాహం వెంబడి చాలాదూరం ఈదుకు పోయాడు," అన్నాడు అన్న.

"అది తబకీగాడి ఆలోచన అయి ఉండాలి. షేర్‌ఖాన్ మొహానికి అంత తెలివి తేటలు కూడానా?" మౌగ్లీ నోట్లో వేలు వేసుకుని కొంచెంసేపు ఆలోచించాడు. "ఈ పెద్ద కనుమకొన మైదానం మీదుగా పోతే అర మైలు దూరంలో ఉన్నది. మందను అరణ్యంకుండా కనుమ తల దగ్గిరికి తీసుకుపోయి, కనుమలోకి తోలగలను. కాని షేర్‌ఖాన్ రెండో చివర నుంచి చల్లగా జారుకుంటాడు. ఈ చివరను ఎలాగైనా అడ్డాలి. అన్నా, నీవు మందను రెండుగా చీలదీయలేవా?" అన్నాడు.

"అది నావల్ల అయేపని కాదులే. అందుకు తగినవాణ్ణి తెచ్చాగా?" అంటూ అన్న పరిగెత్తుకుంటూ వెళ్ళి ఒక గుంటలోకి దూకాడు.

అందులో నుంచి ఒక పెద్ద తల బయటికి వచ్చింది. ఆ క్షణంలోనే వేటాడే తోడేలు పిలుపు కూత చుట్టూ ప్రతిధ్వనించింది.

"అకేలా! అకేలాయే!" అంటూ మౌగ్లీ ఆనందంతో చప్పట్లు చరిచాడు. "నువు నన్ను మరిచిపోవని తెలుసు, అకేలా. ఇప్పుడు మనకు చేతినిండా బోలెడు పని! ఈ మందను రెండుగా చీలదియ్యి, అకేలా. ఆడపశువులనూ, దూడలనూ ఒక మందగానూ, ఎద్దులనూ, దున్నలనూ ఒక మందగానూ వేరు చెయ్యి," అన్నాడు.

అకేలా, అన్నా మంద మధ్యగా పరిగెత్తుతూ, మౌగ్లీకి కావలసినట్టుగా మందను



రెండుగా విడగొట్ట సాగారు. ఒక మందలో అడపశువులూ, దూడలూ ఉన్నాయి. అడ పశువులు కళ్ళు పెద్దవిచేసి, కాళ్ళతో నేలను గోరాడుతున్నాయి. తోడేళ్ళలో ఏ ఒకటి ఒక్క క్షణం కదలకుండా నిలబడినా, కాళ్ళతో మట్టగించి చంపటాని కవి సిద్ధంగా ఉన్నాయి. రెండో మందలోని ఎద్దులూ, దున్నలూ ముక్కులతో బుసలు కొడుతూ మరింత భయంకరంగా ఉన్నాయి. కాని నిజాని కవి అడపశువులంత అపాయకర మైనవి కావు. దూడల ప్రాణాలకు తమ ప్రాణాలను అడ్డంవేసే అడపశువులే నిజంగా రౌద్రమైనవి.

త్వరలోనే మందలు చక్కగా విడి పోయాయి. అరుగురు గొడ్లకాసే పిల్లలైనా ఈ పని ఇంత చక్కగా చేసి ఉండరు.

"తరవాత ఏమిటి? మందలు మళ్ళీ కలిసి పోగలవు," అన్నాడు అకేలా.

"మగపశువుల మందను ఎడమ పక్కగా తోలు, అకేలా," అంటూ మౌగ్లీ "రాముడి" మీద ఎక్కి కూర్చుని, "అన్నా, మా మంద వెళ్ళాక రెండో మందను కనుమ దిగువకు తోలు," అన్నాడు.

"కనుమలోకి ఎంతదూరం తోల మన్నావు?" అని అన్న అడిగాడు.



"కనుమ గోడలు షేర్‌ఖాన్ దూకలేనంత ఎత్తుండే చోటికి మందను చేర్చి, మేము అవతల చివర నుంచి వచ్చేదాకా వాటిని అక్కడే ఉంచు," అన్నాడు మౌగ్లీ.

అకేలా మగపశువుల ముందు నిలబడి అరిచే సరికి, అవి అకేలా మీదికి పరుగు తీశాయి. అకేలా వాటికి అందకుండా ముందు పరిగెత్తుతూ వాటిని చుట్టు దారిన కనుమ తలవేపు తీసుకుపోయాడు. ఈలోపుగా అన్న అడపశువుల మందను కనుమ దిగువ చివరకు చేర్చాడు.

షేర్‌ఖాన్ కనుమలో నిద్రపోతున్నాడు. అసలే పిరికి ప్రాణి, తిని తాగి ఉన్నాడేమో



పోరాడటం అతనికి సాధ్యంకాదు. కనుమ ఎగువ నుంచి దిగువకు వాలుగా ఉంటుంది. కనుమ దిగువన ఆడపశువుల మందను అడ్డం ఉంచి, పై నుంచి మగపశువుల మందను దూకుడుగా పరిగెత్తించినట్టయితే, షేర్‌ఖాన్ మధ్య నలిగి చస్తాడు. వాడు మగ పశువుల పాదఘట్టనకు చాపక ఆడపశువుల మంద కేసి వెళ్ళాడో, అవి వాణ్ణి కొమ్ములతో చీల్చి చంపేస్తాయి.

ఇదే మౌగ్లీ ఆలోచన.

మౌగ్లీ ఎక్కి ఉన్న "రాముడు"తో సహా, మగపశువులమంద, చుట్టు దారిన కొండ ఎక్కి కనుమ పై చివరను చేరుకున్నది. ఇంకా పశువులకు షేర్‌ఖాన్ వాసన తగల లేదు. మౌగ్లీ కనుమ గోడలను పరిశీలించాడు. అవి నిటారుగా ఉన్నాయి. వాటి పైకి లతలు ఎగబాకుతున్నాయి. షేర్‌ఖాన్‌కు ఆ గోడలను ఎగబాకటం అసాధ్యం. వాడు కనుమలో చిక్కిపోయాడు.

"మనం వచ్చినట్టు షేర్‌ఖాన్‌కు చెబుదాం," అంటూ మౌగ్లీ పెద్దగా నవ్వి, మూతికి చేతులు అడ్డం పెట్టి, కనుమ దిగువ కేసి కేకపెట్టాడు.

ఆ కేక కనుమ వెంబడి ఉండే ప్రతి కొండరాతి నుంచీ ప్రతిధ్వనించింది.

షేర్‌ఖాన్ మత్తుగా ఆవలించి, "ఎవరా పిలిచేది?" అన్నాడు.

"నేనే, మౌగ్లీని. శిఖరాన సమావేశానికి వేళయింది పద!" అంటూ మౌగ్లీ, "అకేలా, మందను దిగువకు తరుము. రాముడూ, దౌడుతియ్యి," అని తొందర చేశాడు.

మగపశువులమంద మహాప్రవాహం లాగా కనుమ వెంబడి పరుగు ప్రారంభించింది. అకేలా వేటకేకలు వేశాడు. మందల పాద ఘట్టనకు రాళ్ళూ, ఇసుకా చిందరవందరగా లేచాయి. దిగువకు పోతున్నకొద్దీ వాటి వేగం హెచ్చింది. రాముడికి పులివాసన తగిలి గట్టిగా రంకెపెట్టింది. —(ఇంకావుంది)



# 62. పినాంగ్ దీవిలో బౌద్ధమఠం

మలేయ లోని పినాంగ్ దీవి బ్రిటిషువారి అధీనంలోకి వచ్చిన తొలి దూరప్రాచ్యప్రదేశం. ఇక్కడ "కెక్‌లొక్‌సీ" అనే బౌద్ధమఠం 30 ఎకరాల ఆవరణగలది. దీని గోపురాలలో పెద్దది ఏడంతస్తులు.



Photo by T. S. Satyan



బహుమతి
పొందిన వ్యాఖ్య

అంగవిన్యాసం

పంపినవారు:
కె. పి. రావు, మద్రాసు

Photo by Madan Gopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

అంగుష్ఠాభినయం

పంపినవారు:
కె. పి. రావు, మద్రాసు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1967 మార్చి నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అంగవిన్యాసం

రెండవ ఫోటో : అంగుష్ఠాభినయం

పంపినవారు : కె. పాండురంగారావు,

17, రామన్‌స్ట్రీట్, టి. నగర్, మద్రాసు – 17

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# నాకు ఒకటి ఇవ్వు!

## కృష్ణా మిఠాయిలు







కె.సి.పి. లిమిటెడ్, ఉయ్యూరు & మద్రాసు

Criterion-KCP-936 Te

# చందమామ

**ఇప్పుడు 6 భాషలలో ప్రతినెలా వెలువడుతున్నది.**

తెలుగు - కన్నడము - తమిళము

హిందీ - మహరాష్ట్ర - గుజరాతీ

★

చందమామ నెలనెలా 2,50,000 గృహాలను అలంకరిస్తుంది

★

మీ వ్యాపార సందేశాన్ని అందించటానికి

ఇది శక్తివంతమైన ప్రచారసాధనం

వివరములకు :

## చందమామ పబ్లికేషన్స్

వడపళని :: మదరాసు - 26

XXIII

